# అభ్యుదయ

జులై 1979 • ఒక రూపాయి

ప్రేంచంద్ శతజయంతి సంవత్సరం



# అభ్యుదయ మాసపత్రిక

సంపుటి 4 సంచిక 6 సం. చందా రు 10

## విషయసూచిక



ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం

# విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

## 1979 నవలల పోటీ ఫలితాలు

□□□

ప్రథమ బహుమతి :

**'మనిషికీ మనిషికీ మధ్య'**

— వి. రాజారామమోహనరావు

ద్వితీయ బహుమతి :

**'స్మశానం దున్నేరు'**

— డా॥ కేశవరెడ్డి

తృతీయ బహుమతి :

**'శతాబ్దాల నిశ్శబ్దం'**

— దశరథ్

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

చంద్రం బిల్డింగ్స్, విజయవాడ - 4.

# జీవనాడి పసిగట్టిన కథకుడు

# ప్రేంచంద్

**1880 జులై 31** **1936 అక్టోబరు 8**

**(అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం 1979 జులై నుండి 1980 జులై వరకు ప్రేంచంద్ శతవార్షికోత్సవ సంవత్సరంగా జరపాలని భావించింది. ఆ ఉత్సవాలలో భాగమే అభ్యుదయ సమర్పిస్తున్న ఈ సాహిత్య నీరాజనం. సం.)**

హిందీ కథావాఙ్మయాన్ని, నవలా సాహిత్యాన్ని 30 సం॥లపాటు తన అపూర్వ రచనా కౌశలంతో ఉర్రూత లూగించిన ప్రేంచందు 1880 లో జన్మించాడు. జీవిత మంతా దారిద్ర్యంతో మగ్గిపోయినా, తన ఆదర్శాలకై జీవి తాన్నే అంకితం చేసిన ధన్యజీవి ఆయన. పరప్రభుత్వపు దాస్య శృంఖలాలు, జమీందారుల అన్యాయాల కబంధ హస్తాలలో కొట్టు మిట్టాడుతున్న అమాయక మూగ ప్రజానీకానికి ప్రాతినిధ్యం వహించి, వారి కష్ట సుఖాలకు, మంచి చెడులకు అద్దంపట్టినట్లు రచనలు సాగించాడు ప్రేంచందు.

తల్లితండ్రులు పెట్టిన పేరు ధనపత్ రాయ్. మొదట్లో ఉర్దూ భాషలో నవాబ్ రాయ్ అనే పెన్ నేమ్ తో రచనా వ్యాసంగం ప్రారంభించి, తన కండ్ల ఎదుటే 'సోజేవతన్' (దేశ ప్రేమ) అనే తన పుస్తకం కాపీలు తగలబెట్ట బడగా, ఆయన హిందీలో ప్రేంచందు అనే ధర్మనామంతో దాదాపు 350 కథలూ, 14 నవలలూ రచించాడు. ఒకటో అరో నాటకం వ్రాయాలని విఫల ప్రయత్నం చేశాడు. ఈ కథలన్నీ 'మాన సరోవర్' అనే పేరిట 8 సంపుటాలుగా వెలుబడ్డాయి.

ప్రేంచందు నవలల్లో జమీందారీ వ్యవస్థకు వ్యతిరేకంగా రైతుకూలీ సమాజం వారి కడగండ్లను కళ్ళకు గట్టినట్లు చిత్రించినా, వాటిలో ఆదర్శోన్ముఖ మయిన యధార్థ వాదమే చిత్రించ బడింది. ప్రతి నవల ఏదో ఆదర్శప్రతి పాదనతో ముగుస్తుంది. అయితే "గోదాన్" అనే చివరి నవలలో ఈ ఆదర్శ వాదానికి స్వస్తి చెప్పి, యధార్థ వాదానికి నివాళి పట్టాడు. ఆతరవాత బ్రతికి గనక ఉన్నట్లయితే, ఆయన అభ్యుదయ భావ ప్రధానమయిన ఎటువంటి రచనలు ప్రసాదించి ఉండేవాడో!

ప్రేంచందు నవలలు సామయిక మయిన (తాత్కాలిక మయిన) జమీందారీ వ్యవస్థ పట్ల ఏవగింపు కలిగిస్తాయి. జమీందార్ల– సాహుకార్ల అక్రమాలకు

— డా॥ భీమ్‌సేన్ నిర్మల్

గురి అయిన రైతు-కూలీ సోదరుల పట్ల సామభూతిని రేకెత్తిస్తవి. కాని అవి సంఘంలోని ఒకానొక వ్యవస్థను చిత్రించేవి కనుక, ఆ వ్యవస్థ మారి పోగానే, వాటికి అంత ప్రాధాన్యం ఉండదు. కాని ప్రేంచందు కథలు మాత్రం గ్రామీణుల మనస్తత్వాలను యథా తథంగా-మంచి చెడుగులు, ఆ మాయకత్వం-కౌటిల్యం మొదలైన వాటి ని-చిత్రించడంలో వాటి ప్రాధాన్యం శాశ్వతం. ఇందులో కూడా గ్రామ్య జీవితాన్ని చిత్రించడంలో ప్రేంచంద్‌కు లభించిన సాఫల్యం నగరజీవితాన్ని చిత్రించడం లో లభించలేదు. దీనికి కారణం ఆయన పుట్టి పెరిగింది 'లమ్హా' అనే కుగ్రామంలో, ఆ తరవాత ఉపాధ్యాయుడుగా పనిచేసింది చాలా మటుకు గ్రామాల్లోనే. అందుచేతనే ఆయన ఒక చోట-రచయిత తను చిత్రించే జీవితాన్ని స్వయంగా జీవించాలంటాడు. ఈ సూక్తికి ఆయన జీవితమూ-కథలే తార్కాణ. కీ.శే. డా॥ హజారీ ప్రసాద్ ద్వివేదీ గారు నగరాల్లో నివసించే వారికి ప్రేంచందు కథలు ఆశ్చర్యాన్ని కలిగిస్తవని, గ్రామాల్లో నివసించే పాఠకులకు తాము రోజూ చూసి-అనుభవించే సంఘటనతే కనిపిస్తాయని అన్నారు.

ఆ రోజుల్లో (ఈనాడు కూడా) గ్రామీణుల్లో అంధ విశ్వాసాలతో కూడు కొన్న సంకుచిత దృక్పథంతో పాటు, విష్కల్మషమయిన ఔదార్యం గూడ కట్టుకొని ఉండేది. బ్రిటీషు ప్రభుత్వపు కూటనీతిమూలంగా 'పంచపరమేశ్వర్' (పంచాయితి లో పరమేశ్వరుడు ఉంటాడు) అనే పవిత్ర భావన నశించి పోతూంటుంది. ప్రేంచంద్ 'పంచపరమేశ్వర్' అనే కథలో గ్రామీణుల్లోని స్వార్థాన్ని, కుళ్ళుబుద్ధిని చిత్రిస్తూనే, పంచ్ లో గల పరమేశ్వరత్వాన్ని-స్వార్థానికి అతీతమయిన భావాన్ని-ముందుంచుతాడు.

"పూస్‌కీరాత్" (పుష్య మాస పు రాత్రిళ్ళు) అనే కథలో చలి బాధ తట్టుకోడానికి కంబళికి నోచుకోని దౌర్భాగ్య దామోదరులయిన రైతుల జీవితాన్ని చిత్రించి గుండెలు పిండేస్తాడు. 4

"లోకమత్‌కా సమ్మాన్" అనే కథలో గ్రామంనుండి పట్టణానికి వచ్చి, నాలుగు రూపాయల సంపాదన ఎక్కువ కాగానే తాగుడుకు, జూదానికి అలవాటు పడిపోయిన రైతు సోదరుడి జీవితాన్ని "కఫన్"లో సోమరిపోతు జీవితానికి అలవాటుపడ్డ, తండ్రి-కొడుకుల జీవితాన్ని చిత్రించాడు.

"బలిదాన్" అనే కథలో పట్టెడు భూమికై ప్రాణాలు అర్పించే రైతు జీవితం చిత్రించాడు. "సభ్యతా కారహస్య" అనే కథలో సాంఘికకట్టుబాట్లకు గ్రామీణులు ఎలా కట్టుబడిఉంటారో సూచించాడు. ఇలా "అలగ్యోఝా", "పచ్

తావా", "సవాసేర్ గెహూం", "పిసన్ హారికా కుంవా", "ఘాస్‌వాలీ" మొదలయిన కథలలో గ్రామ్యజీవనంలోని వికృతులు, చెడుగులతోపాటు వారి నిశ్చల ప్రేమ, మమకారం, సారళ్యం, కర్తవ్య పరాయణత్వం మొదలయిన సద్గుణాలను కూడా చిత్రించాడు ప్రేంచంద్

మధ్యవర్గీయుల జీవితాలని చిత్రిస్తూ కూడా ప్రేంచంద్ ఎన్నో కథలు వ్రాశాడు "మాతాకా హృదయ", "బూఢీ కాకీ", "మమతా", "ప్రాయశ్చిత్" ఇలా చెప్పుకోదగ్గ కథలు ఎన్నో ఉన్నాయి. "ఖాసీఖాత్ మేం ఖుదాకాసారూ" అనే కథలో మొక్కుబళ్ళమీద దెబ్బ తీసాడు.

అయితే ప్రేంచందు స్వతహాగా ఆదర్శప్రియుడు. గాంధీ సిద్ధాంతాలు ఆయనను ఎంతగానో ప్రభావితంచేసాయి. స్వార్థపరుడు, కుటిలుడు అయిన మానవుడిలో ఔదార్యం, నిష్కల్మషత్వం ఉన్నాయని, దుర్గుణాలను అణగార్చి, సద్గుణాలను ప్రేరేపించడమే రచయిత కర్తవ్యమని ఆయన మనసారా నమ్మాడు. ఆ నమ్మకానికి అనుగుణంగా తన రచనలను రూపు దిద్దుకొన్నాడు. తను స్వయంగా "కలం కా మజ్దూర్" అయి, సాహిత్య కేదారాన్ని పండించాడు. తను మందులు పుచ్చుకోకుండా, తన ఆరోగ్యాన్ని లక్ష్యపెట్టకుండా, తనవద్దఉన్న అణాపైసాలు సహా 'హంస్' అనే పత్రిక నిర్వహణకు వెచ్చించాడు. చనిపోయినపుడు అంత్యక్రియలకు సరిపోయే డబ్బుకూడా ఇంట్లో లేదట. దాదాపు 10 వేల పేజీలు ప్రచురించిన రచయిత ఇంట్లో!

భారతీయ వాఙ్మయంలో రవీంద్రుడు, శరత్‌బాబు, ప్రేంచందు త్రిమూర్తుల వంటివారు. ఆర్థికమయిన సమస్యలంటూ లేని బుద్ధిజీవులను రవీంద్రుడూ, ఆర్థికమయిన ఇబ్బందులలో కొట్టుమిట్టాడుతూ కుటుంబగౌరవానికై ప్రాకులాడే మధ్యవర్గీయులను శరత్తూ చిత్రిస్తే, ప్రేంచందు రైతు-కూలీల జీవిత విధానాన్ని యధాతథంగా చిత్రించాడు. ఈ ముగ్గురి రచనలను ఆమూలాగ్రంగా, క్షుణ్ణంగా అధ్యయనంచేస్తే 20 వ శతాబ్దపు ప్రారంభదశకాల్లోని భారత సాంఘిక చరిత్రను అధ్యయనం చేసినట్లే.

1979-80 సంవత్సరాన్ని ప్రేంచందు జన్మశతాబ్దిగా ఆయన రచించిన వాఙ్మయాన్ని, భారతీయ సమాజాన్ని బహుముఖాలుగా చిత్రించిన ఆయన రచనావైదుష్యాన్ని పరిశీలించి, భారతీయ సమాజానికి ఆయన చేసిన సేవలను స్మరించుకోవడం ప్రతిపాఠకుడి కనీసకర్తవ్యం.

□□□□□

# ప్రేంచంద్ తాత్వికత

[ప్రేంచంద్‌ను గురించి అర్థం చేసుకోటానికి ఆయన రచనలనుండి సేక రించిన ఈ కింది భాగాలు ఉపయోగపడతాయి.]

ధనస్వామిక పాలన :

"ఈ ధనికవర్గ సంస్కృతిలో ధనమే సమస్తసంచలనానికి ప్రధానప్రేరకం. ధనికవర్గం బాంకర్లు పెద్ద లాభాలు గడించటానికే పరిపాలన జరుగుతోంది. ఈ దృష్టితో చూస్తే ఈనాడు బాంకర్లే ప్రపంచాన్ని ఏలుతున్నారు. మానవ సంఘం రెండు విభాగాలుగా చీలిపోయింది. కష్టపడి పనిచేసేవాళ్ళది పెద్ద విభాగం. తమ శక్తి పలుకుబడులతో పెద్దవిభాగాన్ని బానిసలుగా చేసుకొన్నవారిది చిన్న విభాగం. ఆ పెద్దవిభాగంపైన వీళ్ళకు సానుభూతి దయ లేదు. పెద్దవిభాగం ఉన్నది కేవలం తమ యజమానులకోసం, చెమటోడ్చటానికి, వాళ్ళకోసం తమ రక్తం ధారపోయ టానికి, ఎన్నడో ఒకనాడు సడీ చప్పుడూ లేకుండా ఈ జీవితంనుండి నిష్క్రమించ టానికి మాత్రమే..."

6

[మహాజనీ సభ్యతా వ్యాసం]

శ్రామిక సంస్కృతి :

"దూర పశ్చిమంలో కొత్త నాగరికతా సూర్యుడు ఉదయిస్తున్నాడు. అతడు ధనికస్వామ్యాన్ని కూకటివేళ్ళతో పూర్తిగా పెరికేశాడు. ఈ నాగరికత వెనక ఉన్న ప్రాథమిక సూత్రం ఏమంటే—శారీరక కష్టంద్వారాకాని బుద్ధిచేతకాని ఏదో ఒకటి సృష్టించే ప్రతి పౌరుడు సంఘంలో సభ్యుడుగా గౌరవం పొందగల్గుతాడు. మరొకరి కష్టం బలంమీద ఇతరులపై ప్రభుత్వం నెరపేవాళ్ళూ, తాత తండ్రులు కూడబెట్టిన ఆస్తులు గలవాళ్ళూ అంతా హేయమైనవాళ్ళు అటువంటి వాళ్ళకు ప్రభుత్వ విషయా లలో తమ అభిప్రాయం ప్రకటించటానికి ఎటువంటి హక్కు లేదు. వాళ్ళకు ఎటు వంటి పౌరసత్వపు హక్కు ఉండగూడదు ధనవంతుడు ఈ తాకిడితో కోపంతో తన గొంతు ప్రపంచంలోని ఇతర ధనికవర్గాల గొంతులతో కలుపుతాడు. దాన్ని శపిస్తాడు..."

[మహాజనీ సభ్యతా వ్యాసం]

ఇది దీర్ఘకాల పోరాటం :

"సమ్మె చేయండి. కాని ఒకనాడో రెండునాళ్ళో కాదు. పట్టణ అధికారులు మన మాట వినేవరకూ ఈ సమ్మె సాగుతుంది. మనం పేదలం. దిక్కులేనివాళ్ళం. దుఃఖజీవులం. గొప్పవాళ్ళు ప్రశాంతంగా ఆలోచిస్తే ఈ పేదలే వాళ్ళను గొప్ప

వాళ్ళుగా చేశారని గుర్తిస్తారు. ప్రాణాపాయంతో ఈ విశాల భవనాలు కట్టింది ఎవరు? ఈ బట్టల మిల్లులు నడిపేది ఎవరు? ప్రతినిత్యమూ వారిండ్లకు పాలు వెన్న మోసుకుపోయేవారెవరు? ఈ గొప్పవాళ్ళ నాస్తాలకోసం పండ్లు మిఠాయిలు అందించేది ఎవరు? ఊడ్చేది ఎవరు? ఉతికేది ఎవరు? ప్రతి ఉదయం జాబులు వార్తాపత్రికలు అందించేది ఎవరు? పట్టణంలోని ఒక్క వంతు వారి లాభాలకోసం మూడు వంతుల జనం తమ రక్తాన్ని ధారపోస్తున్నారు...."

[కర్మభూమి నవల]

పేదలపార్టే నాది :

"నేను ఏపార్టీవాడ్నో అని మీరు అడుగుతున్నారు. నేను ఏపార్టీవాడ్నికాను. ఎందుకంటే ఈ రెండు పార్టీలలో ఏదీ ప్రయోజనకరమైన పని చేయటంలేదు. పేదలకు రాజకీయవిద్య గరపటం తమ కార్యక్రమంగా చేపట్టే భవిష్యత్ పార్టీయే నా పార్టీ"...

(మిత్రుడు నిగమ్‌కు 1923 ఫిబ్రవరి 17న రాసిన లేఖ)

నేను బోల్షివిక్‌ను :

7

"ఇప్పుడు నేను బోల్షివిజం సూత్రాలు దాదాపు సంపూర్ణంగా అంగీకరించాను"

(నిగమ్‌కు 1919 డిసెంబరు 21న రాసిన లేఖ)

దేవుడంటే అసహ్యం :

"'ఈ ప్రపంచంలో దేవునికంటె క్రూరుడు మరొకడు ఉండడు. తన ఆటబొమ్మలనే, వాటి తప్పిదాలకు, చెడుగులకు, నరకపు మంటలలోకి తోసి శిక్షించే దేవుడు దయాపరుడుకాడు. దయకంటే నిర్దాక్షిణ్యమే దేవునిలో వేయిరెట్లు ఎక్కువ. నేను అలాటి దేవుని భావననే అసహ్యించుకొంటాను."

(మిత్రుడు జైనేంద్రకు రాసిన లేఖ)

"'నాకు దేవునిలో నమ్మకం లేదు. భక్తి లేదు...నేనేమో సందేహస్థితినుండి నాస్తికత్వం వైపు సాగి వస్తున్నాను.''

(మిత్రుడు జైనేంద్రకు రాసిన లేఖ)

"అన్నిటిని మించిన శక్తి ఏదో ఉన్నదని నేను ఇంతకుపూర్వం నమ్మేవాడ్ని. అది నా ఆలోచనాఫలితం వలన కాదు; కేవలం సంప్రదాయంలోని నమ్మకం చేత. ఆ నమ్మకం ఈనాడు తుత్తునియలైంది."

(మిత్రుడు ఇంద్రనాథ్ మదన్‌కు రాసిన లేఖ)

సాహిత్య సిపాయిలం :

''సమాజ పతాకాన్ని ఎత్తిపట్టుకున్న సైనికులం మనం.''

(1936 అ.భా.అ.ర.సం. అధ్యక్షోపన్యాసం)

సాహిత్యానికి చుక్కెదురు ధనస్వామ్యం:

''సాహిత్య మందిరంలో ఐశ్వర్యాన్ని ప్రేమించేవారికి స్థానం లేదు. సేవే జీవితంలో ప్రధానమైందిగా భావించే భక్తులే ఇక్కడ అవసరం. హృదయం బాధపడేవాళ్ళు - ప్రేమ ప్రసాదించే శక్తిగల వాళ్ళే ఇక్కడ అవసరం."

(1936 అ.భా.అ.ర.సం అధ్యక్షోపన్యాసం)

దోపిడీ లేని దేశం :

"స్వరాజ్యం వచ్చిన తర్వాత దోపిడి ఉండదా?" 8

—భార్య శివరాణి ప్రశ్న.

"ప్రతిచోట ఎంతో కొంత దోపిడి ఉంది. బలవంతులు బలహీనులను అణచటమే జీవిత విధానమేమో!! ఐనా రష్యా ఉంది అక్కడ ధనికవర్గాన్ని రూపుమాపారు. ఈనాడు అక్కడ పేదజనం సంతోషంతో ఉన్నారు. బహుశా మనకు ఇక్కడకూడా రష్యావంటిదే రావచ్చు."

—ప్రేంచంద్ సమాధానం.

అసభ్యతే వినోదమనే సినిమా రంగం :

"ఇక్కడికి నాతో తెచ్చుకొన్న కోరికలు ఏవీ ఫలించేటట్టు లేవు. ఈ నిర్మాతలు తాము అలవాటుపడిన కథనుండి ఒక్క అంగుళం కూడ కదలలేరు. అసభ్యతను వినోదపు విలువ అంటున్నారు. అద్భుతాలమీదనే వాళ్ళకు నమ్మకం. రాజులు, రాణులు, వాళ్ళ మంత్రుల కుట్రలు, కల్పిత యుద్ధాలు, ముద్దులు - ఇవే వారికి ప్రధాన ప్రాపకాలు. విద్యావంతులుకూడ చూడటానికి ఇష్టపడే కొన్ని సాంఘిక కథలు నేను రాశాను. కాని వాళ్ళు వీటి చిత్రాలు తీయటానికి శంకిస్తున్నారు.'

(బొంబాయి నుండి జైనేంద్రకు రాసిన లేఖ)

# కథానిక —— బహుచి

శాంతారావుకి కొంపలో శాంతి కరువయింది భార్య శాంతి దేనికోదానికి, కయ్యానికి కాలు దువ్వుతూనే ఉంటుంది.

శాంతికి మనశ్శాంతి లేకుండా పోయింది. భర్త శాంతారావు దేనికో దానికి సణుగుతూనే ఉంటాడు. గొణుగుతూనే ఉంటాడు.

"నన్ను తిట్టినా ఏమనుకోను! కాని పిల్లల ఎదుట నన్ను ఎదిరించి అవమానించకు!" శాంతారావు మొర శాంతి ఖాతరు చెయ్యదు.

"ఇంట్లో ఎన్నైనా అనండి. ఇతరుల ఎదుట నన్ను గౌరవించటం నేర్చుకోండి!" శాంతి వచనాలు శాంతారావు చెవిని సోకవు.

శాంతారావు తన ఆఫీసులో తనతో పనిచేస్తున్న రోజాను చూపించి, "ఆ రోజాను చూడు! రోజంతా కష్టపడి పని చేస్తుంది. సాయంత్రం మొగుడికి, పిల్లలకి యింత వండి పెట్టి—నవ్వుతుంటూ వీధిలో వెన్నెల్లో విహరిస్తుంది!" అంటాడు.

శాంతి తక్కున సమాధానం చెప్పేస్తుంది.

"ఆ వెంకట్రావుని చూడండి. ఉదయం పోతాడు. సాయంత్రం వస్తాడు. ఆ చవిటి ముక్కు భార్యకి వంటయినా రాదు. అయినా సరే-తనే యింత వండి భార్యకి పిల్లలకి పెట్టి మోటారుసైకిలు మీద సినిమాకి తీసుకు పోతాడు!"

శాంతారావు మరి మాట్లాడడు.

శాంతి ముఖం కాంతివంతం అవుతుంది.

ఆదివారం కొందరికి ఆనంద వారం. మరికొందరికి ఆందోళన వారం.

ఎక్కడ మొదలయింది? ఎలా మొదలయింది? అంటే చెప్పడం కష్టం! మొదలవడం మొదలయి రెండు గంటలు కావస్తుంది— పతాక సన్నివేశానికి చేరుతూంది కథ. శాంతి శాంతారావుల డైలాగులు వినబడుతున్నాయి. 9

"మీ అమ్మ బుద్ధే అటువంటిది! మీ నాన్న అంత! మీరూ అంతే! అసలు మీ వంశమే అంత! వెధవ జెడ్డ! మీరూ మనుషులే? ఆ రూపాన ఉన్న రాక్షసులు కాని!"

"మీ నాన్న జనక మహారాజనుకుంటాను! బయల్దేరావు అయోనిజవి! మీ అమ్మ పరమ గయ్యాళి. అల్లుడనేనా ఆలోచించకుండా-తొలిరాత్రి అనయినా సందేహించకుండా—చీర పైకిదోపి, జుట్టు ముడి బిగించి చిందులు తొక్కింది. అసలు తొలి రాత్రే నాకు వెలితి రాత్రి అయింది. ఇంక ఈ దాంపత్యంలో వెలుగెక్కడ?"

—మ. రా. శాస్త్రి

"ఆ ఊసెత్తకండి! అందుకు కారకులు మీరు కాదూ? అందరినీ పిలుస్తానని సరదాపడితే, కుదరదని మొండిగా మీరు చెప్పలేదూ? పదిమంది వస్తే—పది రవికెల గుడ్డలు యివ్వాల్సి వస్తుందని ముఖం చూసుకున్నారు. సుద్ద పిసినారి పీనుగులు మీరు!"

"మరే, మీరు ధారాళహృదయులు! మీ నాన్న దివాన్‌గిరీ వెలిగించిన ముండాకొడుకు! అందుకే తమల పాకు తొడిమకి ముఖం చూసుకున్నాడు."

"ఛీ ఛీ! మీతో నాకు మాటలేవిటి?"

"థూ! థూ! నీతో నాకు పనేమిటి!"

పదేళ్ళ పద్మ పుస్తకం చదువు కుంటూంది, "స్వీట్‌హోం" స్పెల్లింగ్ బట్టీయం వేస్తూంది.

x x x

సోమవారం.

శాంతారావు శాంతంగా రాజీధోరణిలో భార్యతో అన్నాడు.

"చూడు శాంతీ! మనం యిలా చిన్న పిల్లల్లా కాట్లాడుకోవడం ఏం బాగుండ లేదు. మనకేం లేదా పోదా ? పదేళ్ళ క్రిందటి పెళ్ళిగొడవలు తవ్విపోసుకొని తన్నుకోవడం మూర్ఖత్వం కాదూ?"

"అవును. మనం ఎంత తన్నుకు చచ్చినా ఆ ముసిలాళ్ళు యిక మారేది ఎలాగూలేదు. మధ్య వాళ్ల కోసం మనం బుర్రలు బద్దలుకొట్టుకోవడం ఎందుకు?"

"అదే చెపూంట. మనం ఆనందంగా గడుపుదాం. సుఖశాంతుల్ని పంచుకుందాం!"

"సరే ! సాయంత్రం వేగిరరండి. తెమిలి ముస్తాబయి వుంటాను. అలా గాలిలో తిరిగి ఎవరింటికయినా వెళ్ళొద్దాం!"

"ఓ. కె. అలాగే!"

పెరుగు ముద్దలు మింగి, పరుగు పరుగున బస్సు అందుకున్నాడు శాంతారావు. శాంతి యింటి చాకిరీలో మునిగి పోయింది.

శరీరాలు వాటి బాధ్యతల్ని అవి వేరవేరుస్తుంటే బుర్రలో ఆలోచనలు మాత్రం పక్కదోవలు పడుతున్నాయి.

బాత్‌రూమ్‌లో బట్టలు ఉతుక్కుంటూ శాంతి:

"రోజా అంటే ఆగనకి అభిమానం. ఇంత సుగుణాలరాసి ఈయన ఆఫీసు లోనే దాపురించాలా? నా దగ్గర మెచ్చుకున్నట్లే దాని దగ్గరా పొగుడుతారా? 10 పొగిడితే పొంగిమీద పడని ఆడది ఎవత్తి? ఆఫీసులో ఒంటరిగా దొరికితే.. రోజాని..."

శాంతారావు రోజాని దగ్గరికి తీసుకొని గుండెలకు హత్తుకుంటున్నట్లు— మెదడుమీద ఉచిత సినిమా నడిచింది.

శాంతారావు ఆఫీసులో పనిచేసుకుంటూ:

"శాంతికి వెంకట్రావు అంటే అంత యిష్టమా? వెంకట్రావుకి శాంతి పట్ల అంత యిష్టత ఉందా? తను లేనప్పుడు శాంతి వెంకట్రావుని ఆహ్వానించి కబుర్లు చెప్పడం లేదుగదా?"

శాంతి వెంకట్రావులు ఒకరినొకరు పొగుడుకుంటూ కామించుకున్నట్లు మనో

నేత్రం చూసింది. చేతిలో పని ఆగిపోయింది.

x x x

సాయంత్రం శాంతి అందంగాతయారయి సిద్ధంగా వుంది.

శాంతారావువచ్చి టిఫిను కాఫీ సేవించి భార్యను చిరునవ్వుతో పలకరిస్తూ, స్కూటర్ తీస్తూ "ఎక్కడికి వెడదాం!" అన్నాడు.

"స్కూటరెందుకు? పెట్రోలు దండగ! అలా కాస్సేపుతిరిగి. వెంకట్రావు గారింటికి వెళ్ళి వచ్చేద్దాం?" అందిశాంతి.

శాంతారావు మదురు చిట్లించి:

"స్కూటరు మీద పార్కుకి వెళ్ళి అలా వస్తూ రోజా యింటికి వెళ్ళి రావచ్చు-అనుకున్నాను!"

శాంతి ముఖం మాడ్చుకొని:

"మన ఊహలు ఎప్పుడు ఒకటయాయి? ఎక్కడికీ ఒద్దు లెండి! తలనాదుగా ఉంది!"

"నాకూ తల నాదుగానే వుంది!"

వాళ్ళ తలల్లో వున్నది నాదుకాదు; నాచులాంటి బూజి!

—o—

11

# స్వభావం

ఆసాలీడు
ఏ వాగ్దానాల మోహనరాగాల్ని
వినిపిస్తుందో,
ఏ ఆశల మంత్రం వేస్తుందో కాని
పాపం అమాయకపు ఈగకి, తన
కష్టార్జితపు తిండిమీద వెగటు పుట్టి,
తన జీవితం మీద అసంతృప్తి పెరిగి
ఆసాలీడు రాజ్యంలోని, ఆనందాల
అందలం ఎక్కేద్దామనుకొని,
ఆ గూటిలో చేరి, గులామునంటుంది
పాపం, అది వాగ్దానాల ప్రసక్తి
ఎత్తేలోగానే
దాని జీవితం మీద మృత్యువు కత్తి పడుతుంది.

—నిట్టల ఫణిమిత్ర.

# రప్పల్లో వెతకాల్సిన రవ్వలు

ఈనాడు తెలుగులో వస్తున్న కథలను, నవలలను లెక్కించడం సమస్యే అవుతుంది. దిన పత్రికలు మొదలుకొని త్రైమాసిక పత్రికల వరకు అన్నీ కథలను క్వింటాళ్ళ లెక్కన అందిస్తూనే ఉన్నాయి. మంచి కథలు కావాలనుకునే పాఠకుడు ఈ వందల వేల కథలను చదువు తున్నాడు. కాని అందులోంచి నాలుగు మంచి కథలు దొరుకుతాయన్న నమ్మకం లేదు. ముక్కు మొహం చక్కగా ఉంటే. ముఖంలో దైన్యం ఉంటుంది. అలంకారాలతో సింగారించుకుంటే ఆరోగ్యం అంతంత మాత్రమే. అలంకారాలు, ఆరోగ్యం, గుణం అన్నీ ఉన్నాయనుకుంటే అందులో చైతన్యం సున్న. ఏదో ఒకలోపం. అన్నీసమంగా అమరినకథల్లో కొత్తదనం ఉండదు. ఇలా అనేకానేక లోపాలతో సాహితీ విలువలు లేని కథలు నెల నెలా అచ్చు పోసుకుంటున్నాయి. కారణం వ్రాసే రచయితలు నేల విడచి సాము చేయడం, ఏదయినా కొత్తగా తన శైలిలో చెప్పాలనే ధ్యాస లేకపోవడం, కొన్ని ఏండ్లుగా వాడివాడి; నలిగి పోయిన వాక్యాలతో కొసమెరుపులో జీవం లేని కథలు సృష్టించడం.

కవి అయినా రచయిత అయినా కొంత స్వసృష్టి ఉండాలి. ఎవరు ఏ కథ వ్రాసినా అది నా సృష్టి అని చెప్పుకోవడానికి కొన్ని వాక్యాలయినా మిగలాలి. అలా కొన్ని వాక్యాలయినా నావి అని చెప్పుకోలేని వాడు వ్రాయడం దండగ. తెలుగు కథా ప్రపంచంలో ఒక వంద రెండు వందల వాక్యాలున్నాయి- అవి వస్తే యథేచ్ఛగా కథలు వ్రాసేయవచ్చు. ఆ వందా రెండువందల వాక్యాల్లోంచి మచ్చుకు కొన్ని:;

'ఆమె దిండులో మొహం దాచుకొని కుళ్లికుళ్ళి ఏడ్చింది'-'ఆమెబుగ్గల్లో గులాబీలు పూసాయి'-'ఆమె సిగ్గుతో మొగ్గయింది'-'అతడు తోటకూర కాడలావాడిపోయాడు'-'బాల భానుని బంగారు కిరణాలు ఆమెను తట్టి లేపాయి'--'కత్తి గాటుకు నెత్తురుచుక్క లేదు'-'కూతురు' గుండెలపై కుంపటిలా ఎదుగుతుంది'--'ఆమె పెదవులు దొండ పండువలె 12 ఉన్నాయి'--'ఆమె సిగ్గుతో మొగ్గయి అతడిగుండెల్లోగువ్వలా ఒదిగిపోయింది.' ఈ దరిద్రమైన వాక్యాలతో మన తెలుగు కథలు సాగిపోతూనే ఉన్నాయి. నిజానికి మొదటిసారిగా వాడినప్పుడు ఈవాక్యాలు గొప్పవే. కాని చదివి చదివి పాఠకులు విసిగి పోయారు. పది కథలు చదివిన ప్రతి పెద్దమనిషి పదకొండవ కథకు తానే తంత్రడవుతా నంటున్నాడు. అందుకే తెలుగులో కథలు రాసి పెరిగినంత వాసి పెరగడం లేదు. చదువుతున్నంత సేపే తప్ప తరువాత కథగాని పాత్రలు గాని గుర్తుండవు. నిజానికి మనుషుల పరిచయం చాలాలోతైనది. ఎందుకంటె

వసంతరావు దేశపాండే

కథలకు వ్యక్తిత్వ ముండటమే కాదు. కథల్లో మళ్ళీ వ్యక్తులుంటారు. పాఠకుడికి ఆ వ్యక్తుల పాత్రల పరిచయంకూడ లభిస్తుంది. సజీవ వ్యక్తులకన్న కూడ పాత్రలు ఎక్కువ సజీవంగా ఉండగలవి కథలలోని పాత్రలు.

రచయితలు సాహిత్యాన్ని మన జీవితానికి సన్నిహితంగా ఉంచగలుగుతారు ఒక వేళ మనం వాస్తవజీవితాన్ని చూడలేక కళ్ళు మూసుకున్నా వాళ్ళు బలవంతంగా మన కళ్ళు తెరిపిస్తారు. ఇలాకళ్ళు తెరిపించి జీవితాన్ని చూపించగల వాళ్ళు కొత్తగా చెప్పగలిగిన వాళ్ళు, సొంత గొంతు గలవాళ్ళు మన తెలుగులో చాలా తక్కువ మంది.

ఒక రచయితకలం చేతపట్టాడంటే దాంతో మనిషి చుట్టూగల కోట గోడకు ఒక కొత్త కిటికీని తెరవాలి అందులోంచి మనకు కనిపించే రమణీయమైన ప్రకృతి మన కంటికి సేద తీర్చాలి. ఆ కిటికీ గుండా వచ్చేగాలి మనల్ని ఆరోగ్యపు వాకిళ్లలోనిలబెట్టాలి. లేదా మనకు తెలియని సత్యాన్ని ఆ కిటికీ-దర్శింపజేయాలి. లేకపోతే పద్దులు రాసే కలానికీ-రచయిత కలానికి భేదమేమిటి?

గురజాడ కలం పట్టాడు తొలితెలుగు కథ పుట్టింది. మల్లాది కలం పట్టాడు-- వేశ్యల జీవితాలను యితివృత్తంగా గ్రహించి అందమైన కథలు వ్రాసారు.

చలంగారు స్త్రీ స్వేచ్ఛను బలంగా ప్రతిపాదిస్తూ ఎన్నో గొప్ప కథలు వ్రాసారు. తెలుగు భాషకు అందునా వ్యావహారిక భాషకు అంతటి వాడి-వేడిఉందని మనకు చలాన్ని చదివాకనే తెలిసింది.

తెలుగు వచనం ఎంత సాఫీగా ఉంటుం-దో-కథను ఎంత సంక్షిప్తంగా చెప్పొచ్చో కుటుంబరావుతో తెలిసింది. కుటుంబరావుగారు డీల్ చెయ్యని మధ్యతరగతి సమస్యేలేదు. ఆయన ఏది వ్రాసినా సైంటిఫిక్ ఎప్రోచ్, సోషల్ కాన్షస్‌నెస్‌తో వ్రాసారు. కథను యింత సాఫీగా, ఏ వర్ణనా ఏ ఉపమానాలు లేకుండా చెప్పిమెప్పించవచ్చని కుటుంబరావుగార్ని చదివాకే తెలుస్తుంది.

తెలుగు కథా రచయితలలో ఎవరినయినా అనుకరించ వచ్చేమో కాని ఇద్దరిని మాత్రం అనుకరించడం కష్టం. ఒకరు చలంగారు. యింకొకరు కుటుంబరావుగారు.

హృద్యమైన కథలెన్నో వ్రాసారు మునిమాణిక్యంగారు. వీరి కాంతం తెలుగుజాతి స్త్రీకి ప్రతిరూపం.



తెలుగు కథను ప్రపంచ స్థాయిలో నిలబెట్టారు పాలగుమ్మి పద్మరాజుగారు.

గురజాడ, శ్రీపాద, చలం, చింతా దీక్షితులు, మా. గోఖలే, కుటుంబరావు, బుచ్చిబాబు, మునిమాణిక్యం లతో ఒక తరం అయిపోయింది.

ఇక రెండవ తరం—ఈ తరంలో రా. వి. శాస్త్రి, బీనాదేవి, కాళీపట్నం, ముళ్ళపూడి, శ్రీమతి ఆర్. వసుంధరాదేవి, భానుమతి ఇత్యాదులు.

వీళ్ళంతా నిన్న మొన్నటి వాళ్ళు. వాళ్ళ తరం అయిపోయింది.

ఇక నేటి తరం ముందుకు రావలసి ఉంది. నేడు మనకు పత్రికలు పెరిగాయి వ్రాసే వాళ్ళు పెరిగారు. కాని మంచి

కథలు రావలసినంతగా రావడం లేదు. ఈనాడు వ్రాస్తున్న యువతరం కథా రచయితలకు తమకంటూ ఒక ప్రత్యేక మయిన శైలి ఏర్పరచుకోవాలనే ధ్యాస ఉన్నట్లు కనిపించడం లేదు. ఏదో వ్రాసేస్తున్నారు. వాళ్ళు ప్రచురించుకుంటున్నారు. అడపా దడపా పదీ-పాతిక ముదుతున్నాయి. సరదాకోసం కాలక్షేపం కోసమేనా కథానిక ! దాని ప్రయోజనం అంతేనా?

ఈనాడు అత్యధికంగా అమ్ముడుపోతున్న పత్రికలు తెలుగు కథకు న్యాయం చేకూర్చడం లేదనిపిస్తుంది. ఏటేటా వేల రూపాయలు 'కథల పోటీ' లకై ఖర్చు చేస్తున్నారు. కాని మంచి కథలకు మాత్రము కాదు. ప్రతి యేడూ సంపాదకులు-కథలను పరిశీలించి గత సంవత్సరం కన్నా ఈ సంవత్సరం ఎక్కువ మంది రచయిత(త్రు)లు పాల్గొన్నారని చెప్తూ-రాసి పెరిగినంత వాసి పెరగ లేదని వాపోతున్నారు. ప్రతి యేడూ పోటీలలో నెగ్గిన 30, 40 కథలలోంచి ఒకటి రెండు మంచి కథలు ఎన్నడం కష్టమవుతుంది. పోటీకి కథ అనేసరికి మన రచయితలకు ఒకే ఆలోచన తడుతుంది. వాడు పేదవాడు-రిక్షావాడు-కూలివాడు. వీరిని గ్రహించి మంచి కథ వ్రాయలేమని కాదు కాని ఎప్పుడూ ఒకటే పాటేనా. హాస్యంతో కూడుకున్న యితివృత్తం గల కథ మంచిది కాదా ! (ఈనాడు వస్తున్న నవలలు కథలు చూస్తూ ఉంటే మనం హాస్యానికి రోజు రోజూ దూరమౌతున్నామేమో అనిపిస్తుంది.) మానసిక విశ్లేషణలో సాగే కథ మంచిది కాదా ! కథకు ఒక మలుపు ఒక ఫ్లాష్ బ్యాక్-అంత అవసరమా.

ఒకనాడు ప్రబంధాలను తిట్టిపోశాము మనం. కాని అదే గతి నేడు మన కథలకు పట్టిందని గుర్తించరేం. అదే ఎప్పుడూ ఒకే రకమయిన సెంటిమెంట్-ప్రేమ కథలు. కాదంటే శాస్త్రీయమైన అవగాహన లేని ప్రైజు నాశించే పేద కథలు-ఆకలి అరుపులు. ఏళ్ళ తరబడి నుండి అరిగిపోయిన గ్రామ ఫోను రికార్డు మోతలా సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనలు. ఏ భావం చెప్పాలన్నా పాత ఎంగిలి మాటలు-వాక్యాలు. నేడు వస్తున్న కథలోంచి ఏ రచయితా ఈ వాక్యం పూర్తిగా నా సొంతం అని చెప్పుకునేలా లేదు. పేరున్న పెద్ద పెద్ద రచయితలకే ఈ ధ్యాస కనిపించదు. అసలు ఆలోచించే పనేముంది. మన పూర్వులఆస్తిలాగ 14 కొన్ని వాక్యాలు భావాలు ఉన్నాయి వాటిని వాడుకుంటే సరి ! అన్న ధోరణే కనిపిస్తుంది. కాని ఇలా అనుకున్నన్ని రోజులు తెలుగు కథ యింక ఎదగదు. ప్లాట్ ఎంత గొప్పదయినా కావచ్చు కాని చెప్పే తీరులో కొత్తదనం ఉండాలి.

విషయంతో-శైలి సంగమించితేనే ఒక చలం పుడతాడు. ఒక బుచ్చిబాబు ముందుకు వస్తాడు.

నిజానికి మన కథకులకు ఉన్న ఎంగిలి వాక్యాల దౌర్భాగ్యం మన కవులకు లేదు. వారికి ఒక్కొక్కరికి ఒక్కో శైలి ఉంది. కొన్ని పదాలు కొన్ని పదబంధాలు వారి సొంతం. శ్రీ శ్రీ. కృష్ణశాస్త్రి, తిలక్, కుందుర్తి

నారాయణరెడ్డి, మల్లారెడ్డి, శేషేంద్రశర్మ, నగ్నమని, శివారెడ్డి, వేగుంట....ఇలా ఒక్కొక్కరికి ఒక రీతి ఉంది పదాల కూర్పులో, భావ వ్యక్తీకరణకు అది యింకొకరు అనుకరిస్తే-వినేవాళ్లు ఆరు స్తారు. ఈ మర్యాద మన కథకులు అనుసరిస్తే ఎంత బాగుంటుంది.

నిజానికి తనకంటూ ఒక భాష, భావ వ్యక్తీకరణ తీరు, శైలి ఏర్పరచుకున్న వాడే సాహిత్యంలో మిగుల్తాడు పది కాలాల పాటు, లేకుంటే వాడి బ్రతుకు ఆ పత్రిక మార్కెట్‌లో ఉన్నంత కాలమే (మాస పత్రికయితే నెలరోజులు, వార పత్రికయితే వారం రోజులు, దిన పత్రికయితే దినమే మరి).

ఏది చెప్పాలన్నా కొత్తగా యింతకు ముందు ఎవరూ చెప్పని తీరులో బలంగా చెప్పాలనే-నియమం ఉండాలి. అది వర్ణనమే కావచ్చు, వ్యక్తి చిత్రమే కావచ్చు, ఏదయినా కొత్తగా చెప్పాలి. ఇలా ప్రతి కథకుడు ప్రయత్నించి కథలు వ్రాసిన నాడు తెలుగు కథలలో వైవిధ్యం పెరుగుతుంది, ప్రతి కథ ఒక విలక్షణత్వంతో విరాజిల్లుతుంది.

—o—



# విప్లవం

పాత రాతియుగాల
రోత ఆలోచనల
నాశనం విప్లవం !

దిగంతాలకు అరుణ
రాగాన్ని కొని పోవు
వాహనం విప్లవం !

పూరి గుడిసెల మీద
పులకించి ఎగిరేటి
కేతనం విప్లవం !

పెట్టుబడి కూటాల
గుట్టు వెల్లడిచేయు
సాధనం విప్లవం !

మత్త మాతంగాల
మస్తకములను చీల్చు
ఆయుధం విప్లవం !

సకల సమ్మతమైన
సమధర్మ స్థాపనకు
ఆహవం విప్లవం !

—అదృష్ట దీపక్

# అఖిలభారత అరసం మహాసభలు

అఖిలభారత స్థాయి సకల భారతీయ భాషల అభ్యుదయ రచయితల మహాసభలు బహుశా ఈ సంవత్సరాంతంలో మధ్యప్రదేశ్‌లో జరిపే అవకాశం ఉందని ఢిల్లీలోని భారత ప్రగతిశీల రచయితల సమాఖ్యనుండి అందిన సమాచారాన్ని బట్టి తెలుస్తోంది.

అదే సమయంలో ప్రేమ్‌చంద్‌పై అంతర్జాతీయ మహాసభలుకూడా జరుగుతాయని భావిస్తున్నారు.

అయితే మధ్యప్రదేశ్‌లో అభ్యుదయ రచయితల ఉద్యమానికిగల బలమైన కేంద్రాలలో ముఖ్యంగా జబల్‌పూర్, భోపాల్ రెండూ ఈ చారిత్రాత్మక మహాసభలకు ఆతిథ్య మివ్వాలని పోటీపడుతున్నాయి. ఈ రెండు కేంద్రాలలో ఎక్కడ జరిపేదీ రెండుమూడు నెలల్లో తేలుతుంది.

భారతదేశంలోని ప్రపంచంలోని అన్నిభాషలలో వెలువడ్డ ప్రేంచంద్ రచనల ప్రదర్శన, ఆయన జీవితానికి సంబంధించిన చాయా చిత్రాల ప్రదర్శన, ఆయన రచనల ఆధారంగా తీసిన చలనచిత్రాల ప్రదర్శన కూడా ఏర్పాటు చేయాలని శాంతి సంఘీభావ సంఘం (A,I.P.S.O.) వారు సంకల్పించారు. 16

X X X X

మధ్యప్రదేశ్ అరసం ఇటీవల మూడు వర్క్‌షాపులను నిర్వహించింది. కథానిక, నవల, కవితలపై జరిపిన ఈ వర్క్‌షాప్‌లు ముఖ్యంగా యువరచయితలకి ఎంతో స్ఫూర్తిని కొత్త అవగాహనని అందించి శిల్పచాతుర్యాన్ని మెరుగుపర్చేందుకు తోడ్పడ్డాయి. మధ్యప్రదేశ్ సాహిత్య జగత్తులో ఇవి పెద్ద సంచలనం కల్గించాయి.

మధ్యప్రదేశ్ శాఖ "పహెల్" అనే అత్యుత్తమమైన సాహిత్య పత్రికను వెలువరిస్తోంది. సాహితీపరుల అభిమానమును ఈ పత్రిక చూరగొంటుంది.

X X X

త్వరలో రాష్ట్రస్థాయిలో పెద్దఎత్తున అభ్యుదయ రచయితల మహాసభలు జరిపేందుకు బీహార్ శాఖ సన్నద్ధమౌతోందని పాట్నా నుండి సమాచారం అందింది. బీహార్ శాఖ 1979 జూలై 31 నుండి 1980 జూలై 31 వరకు సంవత్సరం పొడుగునా ప్రేంచంద్ శతజయంతి సందర్భంగా రాష్ట్రంలో అన్ని ముఖ్య కేంద్రాలలోనూ ప్రేంచంద్ జీవితం సాహిత్యంపై సదస్సులు చర్చాగోష్ఠులు పుస్తక ప్రచురణలు వంటి అనేక కార్యక్రమాలు జరపాలని కార్యక్రమం రూపొందించుకున్నది.

"ఉత్తరశతి" అనే పేరిట సాహిత్య పత్రికను బీహార్ శాఖ సమర్థవంతంగా నిర్వహిస్తోంది. ఈ పత్రిక బీహార్ అభ్యుదయ రచయితల ఆదరాభిమానాలను గౌరవమన్ననలను పొందగల్గింది

# సాహిత్య ఉద్దేశ్యం

(1936 ఏప్రియల్ 9, 10 తేదీల్లో లక్నోలో జరిగిన అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘ ప్రథమ మహాసభకు అధ్యక్షత వహిస్తూ ప్రేమ్‌చంద్ చేసిన ఉపన్యాస సంక్షిప్తసారం)

సాహిత్య యితిహాసంలో భాషకు చాలా ప్రాధాన్యత ఉంది. కాని భాష సాధనం మాత్రమే. సాహిత్యకారుడు అదృశ్యంగా భాషద్వారా భావాలు వ్యక్తం చేస్తాడు. అతని శ్రోతల సంఖ్యా పరిధి చాలా విస్తృతమైంది. రచనలో వాస్తవం సహజత్వం ఉంటే శతాబ్దాలపాటు మానవ హృదయాన్ని కదిలిస్తూనే ఉంటుంది.

రాసిందంతా సాహిత్యం కాదు. అందమైన భాషలో సత్యాన్ని వ్యక్తీకరిస్తూ మనస్సుమీద మేధస్సుమీద ప్రభావాన్ని కల్గించేది మాత్రమే సాహిత్యం. జీవితంలోని నగ్న సత్యాన్ని అనుభూతుల్ని యధాతధంగా వర్ణించినపుడే పైలక్షణాలు సాహిత్యానికి అబ్బుతాయి.

సాహిత్యాన్ని అనేకమంది అనేక రకాలుగా నిర్వచించారు. నా దృష్టిలో "జీవితాన్ని విమర్శించేదే" సాహిత్యం. వ్యాసం ఉపన్యాసం దేల ఏరూపమైనా కావచ్చును. జీవితాన్ని తప్పనిసరిగా వ్యాఖ్యానించాలి. భాష్యం చెప్పాలి. 17

జీవితం అంటే అర్థంతెలియని యుగంనుండి బయట పడ్డాం. ఆనాటి సాహిత్యకారులు కల్పనని కేంద్రం చేసుకుని గారడీకథలు అల్లేవారు. నాటి ఉద్దేశం అద్భుతాల్ని చెప్పి మనోరంజనం కల్పించడం. తర్వాత వ్యక్తివాద ప్రభావాలకులోనై శృంగార భావాల్ని ప్రకటించడంకోసం తమ కల్పనాప్రతిభ నంతా వెచ్చించేవారు.

ఇతివృత్తం జీవితానికి ఎంతదూరమైందైనా కొత్త అలంకారాలు కల్పనలు ప్రయోగిస్తే అదే యశస్సుకు గీటురాయిగా నిలబడి పోతుందనుకొనేవారు. ఆ నైపుణ్యం అంతా విరహ దశలో గుండెని కరిగించే నిరాశ వేదనల వర్ణనకే. ఇలాంటి రచనలు ఇప్పుడుకూడా పాఠకుల మనసుల్ని ఎలా పట్టుకుంటాయో మనకు తెలుసు.

సాహిత్యం నిస్సందేహంగా మన అనుభూతుల తీవ్రతని ఉన్నతస్థాయికి తీసుకెళ్ళాలి. అయితే మానవ జీవితం అంటే కేవలం స్త్రీ పురుషుల ప్రేమ సంబంధమైంది మాత్రమే కాదు కదా. శృంగారం విరహతాపాలు అందులోని నిరాశకే పరిమితమైపోయే సాహిత్యం ప్రపంచంలోని వాస్తవిక అనుభవాల్ని దూరంగా ఉంచడానికి ప్రయత్నిస్తుంది.

ప్రేమ్‌చంద్

ఆనాటి రచయితలు చాలామందికి రచనలే జీవనాధారం. రాజులు జమీందార్లు పోషకులు. సాధారణ జీవిత సమస్యలు వాటి ప్రభావాలు తెలుసుకునే స్థితికి కవులు ఎదగలేకపోయారు. అందువల్ల రచనల్లో మానసిక బౌద్ధిక జీవనం లుప్తమైపోయింది. అయితే ఈ దోషాన్ని సాహిత్యవేత్తలకు అంటగట్టకూడదు. సాహిత్యం ఆయాకాలాలకి ప్రతిబింబం ఏభావం ఏ ఆలోచన మానవ హృదయాన్ని స్పందింపచేస్తుందో అదే సాహిత్యం మీదకూడా నీడలు పరుస్తుంది.

సాహిత్యంలో ప్రతిశబ్దం నైరాశ్యంలో మునిగి తేలుతూ కాలానికివిరుద్ధంగా రోదిస్తూ కేవలం శృంగారానికి ప్రతిబింబమై నిలిస్తే - మానవజాతి పతనమైపోయి జడత్వ పంజరంలో చిక్కుకుపోతుంది. కృషికిగాని సంఘర్షణకుగాని ఆధారమే లేకుండాపోతుంది. మనిషి ఉన్నత లక్ష్యాల్ని గమించలేడు. ప్రపంచాన్ని అర్థం చేసుకొనేశక్తి కోల్పోతాడు.

మన సాహిత్య శక్తులు వేగంగానే పరివర్తన చెందాయి. యిప్పటిసాహిత్యం కేవలం మనసును ఉల్లాసపరచే వస్తువుమాత్రమేకాదు. ఇంకా అనేక ఆదర్శాలున్నాయి. నాయికా నాయకుల సంయోగ వియోగ గాథలు విన్పించి ఊరుకోదు. జీవిత సమస్యల్ని చర్చిస్తూ పరిష్కారాన్ని సూచిస్తుంది. స్ఫూర్తి ప్రేరణల కోసం అద్భుత ఆశ్చర్య ఘటనల్ని వెతకడంకాదు వ్యక్తి,సమాజాలపై ప్రభావం కల్గిస్తున్న సమస్యలే సాహిత్యానికి ఆధారమౌతున్నాయి సాహిత్యంలోని ప్రజల ఉత్కృష్ట అనుభూతుల తీవ్రత రచయితల భావాల్ని ఉద్దేశాల్ని పరిణమింప చేస్తున్నాయి. 18

నీతిశాస్త్ర సాహిత్య శాస్త్రాల లక్ష్యాలు ఒక్కటే అయితే ఉపదేశ పద్ధతిలో భేదముంది. నీతిశాస్త్రం తర్కాన్ని తీసుకుంటే, సాహిత్యం మానసిక సంఘర్షణ భావాల ఆధారంగా ఉపదేశిస్తుంది. వాస్తవ అనుభూతులే కల్పనగా పరిణమించి సాహిత్య నిర్మాణం సాగుతుంది. కవిలో అనుభూతుల తీవ్రతను బట్టి రచనకూడా అంత ఆకర్షణీయంగా ఉదాత్త లక్ష్యాలతో ఉంటుంది. ఆభావాలే లుప్తమైతే. సౌందర్య ప్రేమ జాగృతం కాకపోతే నిజమైన సంకల్పాన్ని సాధించే దృఢదీక్ష కల్పించలేకపోతే ఆసాహిత్యం నిరుపయోగం అసలు అది సాహిత్యమేకాదు. పూర్వసమాజం మతాధీనం మనిషి ఆధ్యాత్మిక నైతిక ప్రవర్తనకు పుణ్య పాపాల సాధనాలతో భయపెట్టి "ధర్మం" తన కార్యం సాధించుకున్నది. ఇప్పుడు ఆ బాధ్యత సాహిత్యానికి వచ్చింది. అయితే సౌందర్య ప్రేమ యిక్కడ సాధనం, కానప్పుడు జౌన్నత్యానికి, మానవత్వానికి దివ్యతకు, అవరోధంగా ఉన్నవాటిన్నింటిని ఎదుర్కొంటాడు రచయిత. దళితులు పీడితుల పక్షపాతం వహిస్తాడు. సమాజం అనే న్యాయస్థానంలో తీర్పుచెప్పి ప్రజలలో ఉదాత్త ప్రవృత్తి సౌందర్యదృష్టి జాగృతం చేస్తాడు. అయితే సత్యం నుండి వాస్తవికత నుండి ఏమాత్రం దూరం కానప్పుడే సమాజ హృదయంలో పరిణామం

తేగలుగుతాడు. భౌతికంగా మనిషి నిర్మాణంలో రక్తమాంసాలు, ఎముకలు కండరాలు ఎలాంటివో వాస్తవికత సజీవత, భావవ్యంజకత, మానవ పరిశీలన మానసికశాస్త్ర అధ్యయనం వంటివి ప్రతి పాత్ర నిర్మాణంలో రచయితకు ఆధారం కావాలి.

కొందరు విమర్శకులు సాహిత్యం రచయిత మానసిక జీవితానికి ప్రతిబింబం అంటారు. ఒకే ఘటన అందరిమీదా ఒకే ప్రభావం కల్గించకపోవచ్చు. దృష్టికోణం మనః ప్రవృత్తిని బట్టి వేరుగా ఉంటుంది. అయితే రచయిత ఏ దృక్కోణాన్నిఇస్తాడో పాఠకుడు అదే అనుసరిస్తాడు. ఇదే రచయిత సాఫల్యం. రచయితలోని ఉదాత్త సంస్కారస్థాయిని చేరుకోవాలని ప్రతి పాఠకుడు వాంఛిస్తాడు.

రోగి తన రోగాన్ని అసహ్యించుకున్నట్టు మానసికంగా నైతికంగా విలువలు కోల్పోయిన మనిషికూడా తన స్థితిని అసహ్యించుకుంటాడు. వైద్యుడిపాత్రని రచయిత వహించాలి. సౌందర్య భావన లేక పోదవడంవల్లనే ఈ బలహీనతలు సౌందర్యంకోసం ప్రతి హృదయం అన్వేషిస్తుంది సాహిత్యం కళాకారుడి భావాత్మకమైన సామ్యతని వ్యక్తీకరిస్తుంది అది సౌందర్యాన్ని సృష్టిస్తుంది. విశ్వాసాన్ని, సత్యాన్ని, సానుభూతిని, న్యాయప్రియత్వాన్ని. మమతను, మానవత్వాన్ని నింపుతుంది. ఇవి ఉన్నచోటే ధృడత్వం, నిజమైన జీవితం. లేనిచోట శత్రుత్వం, ద్వేషం, ఈర్ష్య, మృత్యువు. అనారోగ్యంలో అపత్యం చేసినట్టు 19
సాహిత్యం జీవితాన్ని స్వాభావికంగా స్వతంత్రంగా చేస్తుంది. హృదయానికి సంస్కారంకల్గిస్తుంది. దాని ఉద్దేశ్యమూ అదే.

సాహిత్యకారుడు లేదా కళాకారుడు స్వభావసిద్ధంగా ప్రగతిశీలిగానే ఉంటాడు. ఒకవేళ ఈ స్వభావం లేకపోతే అసలు సాహిత్యకారుడు కానేకాడు. తన కల్పనద్వారా వ్యక్తిలోగాని సమాజంలోగాని సుఖస్వచ్ఛందతలను ఊహించలేనివాడు, వర్తమాన సామాజిక పరిస్థితులకు దూరంగా ఉండిపోతాడు.

బానిసత్వం నుండి పేదరికం నుండి మనజాతి విముక్తి పొందాలనే వేదన సంఘర్షణ ఎంత వ్యాకులతతో అనుభవిస్తాడో ఆసాహిత్యకారుడి రచనలో అంత వాస్తవికత వెలుగు నింపుకుంటుంది. అనుభూతుల్ని క్రమపద్ధతిలో వ్యక్తీకరించే విధానమే కళాకౌశలత్వ రహస్యం. ఈ అంశం ఇంతలా చెప్పాల్సిన అవసరం ఎందుకొచ్చిందంటే ఔన్నత్యానికి, ప్రగతికి ఒకే అర్థాన్ని అందరూ చెప్పడంలేదు. కొంతమంది ఒక పద్ధతి ఔన్నత్యాన్ని సాధిసం అనుకుంటే మరికొంతమంది తద్విరుద్ధంగా భావిస్తారు. ప్రతివారూ తన మనో భావాలు వ్యక్తీకరించడమే కళ అనుకుంటారు. అయితే దాని ప్రభావం వ్యక్తిమీద, సమాజంమీద ఎలా ఉంటుందో అని గమనించే స్థితి ఉండదు. మనల్ని నిర్జీవ జడత్వస్థితిలో నిర్బంధించిన అంతర్బాహ్య కారణాలని దూరంచేసే కర్తవ్యాన్ని, కర్మ నిఇవ్వగలదాన్నుంచి ఔన్నత్యం లభిస్తుంది.

క్షణికమైన ఇతి వృత్తంతో నైరాశ్యంలో ముంచే రచనలు, ప్రస్తుతం అనేక మాసపత్రికలలో పడే ప్రేమకథలు మనలో ఆదర్శంగాని, ఆవేశంగాని, సృష్టించవు. ఇక్బాల్ అంటాడు— "మనిష్వ జీవితంలో రహస్యాల్ని తెలుసుకోవాలంటే సంఘర్షణలలో తప్ప మరెక్కడా లభించవు—సముద్రంలో విశ్రాంతి తీసుకోవడం నది సిగ్గుపడాల్సిన విషయం—ఆనందంకోసం నేను గూడులాంటిఇంట్లో బతకలేను".

అహంకారం, వ్యక్తిగత దృక్కోణమే సర్వస్వం అనుకోవడం జడత్వంలోకి పతనంలోకి విసిరేస్తుంది. అలాంటి కళ వ్యక్తిగతంగా గాని సాముదాయకంగా గాని నిరుపయోగం.

అన్నివస్తువుల లాగే కళకూడా అవసరమైన ఒక సాధనంగా ఉపయోగిస్తున్నారని చెప్పడానికి సందేహించను. జీవితావసర సమస్యల్ని పరిష్కరించలేని మానసిక ఆధ్యాత్మికానందాలు నిరుపయోగం. ఆనందం స్వభావసిద్ధంగా ఉపయోగకరమైన వస్తువు ఆకాశంలో తారలు నిస్సందేహంగా సుందరదృశ్యం. కాని ఆషాఢంలో మాత్రం నల్లని మబ్బులు కనిపిస్తేనే ఆనందం. ప్రకృతితో మనజీవన స్వరాలను మేళవిస్తేనే మనకు భావావేశంతో కూడిన ఆనందం కలుగుతుంది. ఆనందంకల్గించే భావాలు అనుభూతులు అన్నీ వృద్ధి వికాసాలకు తోడ్పడేవే. కళాకారుడు సౌందర్యాన్ని సృష్టించి సామాన్య పరిస్థితిని వికాసోన్ముఖంగా చేస్తాడు. ఇతర వస్తువుల్లాగా సౌందర్యానికి ఆకారంలేదు ఆ ఆనందమూ అందరికీ ఒకే 20 పాళ్ళలో లభించదు.

సంఘజీవనం ఆరంభించినప్పటినుండి బంధుత్వం, సమత, సభ్యత, ప్రేమ అనేవి ఆదర్శవాదులకు తీపికలలుగానే మిగిలిపోయాయి. ధార్మికవాదులంతా నైతిక ఆధ్యాత్మిక పరిమితులతో ఆ కలలను సాధ్యాలు చేయాలని శతధా యత్నించారు. బుద్ధుడు, క్రీస్తు, మహమ్మద్ లాంటివారు నీతి పునాదులమీద సమతా నిలయాన్ని నిర్మించాలని కృషిచేశారు ఏంలాభం? ప్రస్తుత సమాజంలో ఉన్నన్ని కులమతబేధాలు బహుశా ఏకాలంలోను ఉండిఉండవు. ఇప్పుడు కూడా నీతిధర్మాల అంచులు పట్టుకుని సమున్నత లక్ష్యాలను చేరాలంటే వైఫల్యం తప్పదు— అయితే ఈకలలు "ఉత్తేజిత సుప్తిష్కాలసృష్టి" అనుకుని విస్మరిస్తామా? అదే జరిగితే మానసిక ఔన్నత్యానికి పూర్ణత్వానికి ఒక్క ఆదర్శంకూడా మిగలదు. అలా ఆదర్శంలేకపోవడంకన్నా మానవుడి ఉనికే లేకుండాపోవడంమేలు.

ఏ ఆదర్శాన్ని మనం సభ్యతతోబాటు నిలబెట్టామో, దేనికోసం మానవుడు అనేక త్యాగాలు చేశాడో, ఏ పరిణామం కోసం ధర్మాలసృష్టి జరిగిందో, ఏ ఆదర్శం కోసం మానవజాతి చరిత్ర నిల్చిందో దాన్ని శాశ్వత సత్యంగా

భావించి ఔన్నత్య సోపానాలమీద అడుగు పెట్టాలి. సమత కేవలం నైతిక బంధనాల్ని ఆశ్రయించకుండా ప్రత్యేకరూపం ధరించినప్పుడు మనం నూతన సంఘటనకు సర్వాంగాల్ని సృష్టించి పరిపుష్టం చేస్తాం. ఈ ఆదర్శాన్నే సాహిత్యం మన ఎదుట నిలబెట్టాలి.

సౌందర్యం అర్థాన్ని మార్చాల్సి ఉంది. యిప్పటివరకూ అది ధనం, విలాసాల పరిధుల్లోనే ఉంది. కళాకారులు బతుకు తెరువుకోసం ధనవంతుల్ని ఆశ్రయించాల్సి వస్తోంది. ఆ శ్రీమంతుల గొప్పతనాలే రచనలకు మూలవస్తువు, వాళ్ళ సుఖదుఃఖాలు, ఆశ, నిరాశలు వీటిని చిత్రించడమే కళ ఉద్దేశ్యమైపోయింది. ఆ దృష్టి ఎప్పుడూ అంతఃపురాలు, బంగాళాలవైపే పరిగెడుతుంది. శిథిలాలు గుడిసెలు ఆ కళ్ళకి కనిపించవు—ఆ గుడిసెలు శిథిలాలు మానవత్వ పరిధుల అంతర్భాగం కాదని వారి ఉద్దేశం, అక్కడక్కడ వాటిని వర్ణించినా హాస్యంకోసమే. పల్లెటూరి వారి వేషభాషలు హాస్య సృష్టికి వస్తువనుకుంటారు. నిజానికి వారి హృదయాలు, ఆశలు, ఆవేశాలు గ్రహించడమే కళ.

భక్తి వైరాగ్యాలో, ఆధ్యాత్మికభావాలో, జీవితపు, క్షణిక ఆలోచనలో కళకి కల్పనలుగా తీసుకొనే కళాకారుడి చరమోద్దేశం కూడా ఆపరిధుల్ని దాటదు. జీవిత సంఘర్షణలో సౌందర్యోత్కర్షచూసే శక్తి వారికుండదు. వాస్తవంలోని 21 సౌందర్యం ఉనికిని వారు అంగీకరించరు. యవ్వనభారంలో ఉరకలేస్తున్న విలాసినే అతడికి సౌందర్యం గట్టుమీద పిల్లల్ని నిద్రపుచ్చి పొలంలో చెమటోడ్చే స్త్రీలోని ఉదాత్త సౌందర్యాన్ని చూడలేడు. చిందరవందరైన కేశాలు, పాలిపోయిన అధరం, వాడిన కపోలాలలో సౌందర్యం చూడలేక పోవడం దృష్టిలోపం. దృష్టిలో ఉన్నత భావం ఉంటే సిరితో మిడిసి మెరుస్తున్న పెదవులు, చెక్కిళ్ళ వెనక గర్వాన్ని, క్షణికత్వాన్ని గమనించ గల్గుతారు. వాడిపోయిన పెదవుల్లో చెక్కిళ్ళ మీద ప్రవహించే కన్నీటి ప్రవాహంలో త్యాగం, భక్తి శ్రద్ధ ఓర్పులను చూడగల్గుతారు. యిందులో వారనుకొనే "అందం, ఆకర్షణ, సౌకుమార్యం" ఉండవు.

మన కళను యవ్వనపు ఉన్మత్తతలో మునిగి తేల్తున్నాయి. యవ్వనం గుండెల మీద తల ఉంచి కవిత్వం చెప్పడం, శృంగార నాయిక అస్వాభావిక భావావేశాన్ని చిత్రిస్తూ రోదించడం, ఆ నాయిక రూప గర్వాన్ని మత్తెక్కిన కన్నులతో చూపడం వల్ల కళ ఉద్దేశం నెరవేరదు. యవ్వనపు ఆవేశం ఆదర్శాలకు, కష్టాల్ని ఎదుర్కొనే సాహసానికి, ఆత్మ త్యాగానికి మాత్రమే ప్రతిబింబం కావాలి.

"ప్రవాహ వేగాన్ని లక్ష్యపెట్టని తరంగాల లాగే నా జీవితమూను, ఈ అపార సాగరంలో నేను మాత్రం గట్టును వెదుక్కోడం లేను" అంటాడు ఎక్బాల్. సౌందర్య దృష్టికి ఉన్నత లక్ష్యాలున్నప్పుడు, సృష్టి మొత్తాన్ని అదృష్టి పరిధిలోకి యిముడ్చుకో గల్గినప్పుడు, మనకు కూడా ఇక్బాల్ వంటి స్థితి కలుగుతుంది. చెడుని సహించలేని నాడే దాని నిర్మూలనకు నడుం బిగిస్తాం. మానవ జీవితాలు అత్యాచారాలు, బానిసత్వం సహించలేనపుడు కేవలం అది మాత్రం కాయితాలమీద రాసుకుని సంతృప్తిపడం. సౌందర్యం నీతి ఆత్మ గౌరవం మానవత్వాల్ని సృష్టించి తీరాలంటాం.

విలాస మందిరాల్ని సృష్టించడం మనోరంజక సామగ్రిని పోగుచేయడం సాహిత్యకారుడి లక్ష్యం కాదు. సాహిత్య స్థితి గతుల్ని అదుర్గతికి దిగజార్చ కూడదు. దేశభక్తి, రాజనీతిని అనుసరించడంతో బాటు, సాహిత్యం వాటి ముందునిల్చి వాస్తవికతాకిరదీపిక చేపట్టిన మార్గదర్శి కూడా కావాలి

తన చుట్టూ ప్రత్యేక ప్రపంచాన్ని సృష్టించుకుని అదే సర్వస్వం అనుకుని జమీందార్లను ఆశ్రయించే జీవితాలనే చిత్రిస్తూ ఆందోళనలకు, విప్లవాలకు దూరంగాఉండేది అసలు సాహిత్యమేకాదు. వ్యక్తివాదానికి పరిమితమైపోకుండా 22 సామాజిక దృక్పథం పెంపొందించుకున్న సాహిత్యకారుడు వ్యక్తిని, సంఘాన్ని వేరుగా కాక, వ్యక్తికూడా సంఘంలో ఒక అంశ మాత్రమే అని గ్రహిస్తాడు. అప్పుడు సంఘంమీద వ్యక్తి అధికారం లేదా వ్యక్తి స్వార్థంకోసం పనిముట్టుగా ఉండాలన్న వాదాల్ని, సంఘానికి వ్యక్తికి శత్రుత్వం ఉందన్న అభిప్రాయాన్ని తిరస్కరిస్తాడు. సమాజ నిర్మాణంతో బాటే వ్యక్తి ఔన్నత్యం, సమాజం నుండి వేరయితే వ్యక్తి విలువ శూన్యం అని గ్రహించగలుగుతాడు. రచయితా తత్వవేత్తా కూడా యింతకన్నా భిన్నం కాదు. వారికీ ఆ బాధ్యత ఉంది.

అంతర్జాతీయ సాహిత్య [illegible] సాంస్కృతిక ఇతిహాసిక విజ్ఞాన రంగాలలో అన్ని అంశాలపై సుదీర్ఘంగా, లోతుగా పరిశీలిస్తున్నారు. వాటితో పోలిస్తే మన అజ్ఞానానికి సిగ్గుపడాలి. సాహిత్య రచన అనువుగా చెప్పగల స్తోమతు వేగం ఉంటే చాలనుకుంటాం. కాని ఈ భావమే మన సాహితీ సంకోచ, వినాశాలకు హేతువు. సాహిత్య ప్రమాణాలను ఉన్నతం చేసి, సంఘం మీద అధికారం సాధించి, సమాజంలోని ప్రతి భాగాన్ని సునిశితంగా వ్యాఖ్యానించాలి అయితే ఇందులో అన్య భాషా సాహిత్యాన్ని గుడ్డిగా అనుకరించడం కాదు.

స్వశక్తి ఉండేనే ఉన్నత లక్ష్యాలు సాధ్యం.

అంతర్యాలు సౌందర్య ప్రేమజ్యోతితో ప్రకాశితమైతే సేవా ఆదర్శాలు దారులుగా నిలబడితే ప్రతి క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొని జయించవచ్చు. కాని ధనాన్ని విలాసాన్ని ఆరాధించే వారికి సాహిత్య మందిరంలో స్థానం లేదు. సేవే జీవితాదర్శంగా హృదయంలో కష్టాలఅనుభూతుల్ని పొదుపుకున్నవారు ప్రేమావేశం గల ఆరాధకులు ఉదాత్త సాహిత్యాన్ని నిర్మించగలరు. చిత్తశుద్ధితో సేవిస్తే కీర్తిప్రతిష్ఠలు పొందాల్సి వుంటుంది—ఇక గౌరవ ప్రతిష్ఠలకోసం బాధపడ్డం దేనికి? కీర్తి రాకపోతే నిరాశపడ్డం దేనికి ? సేవలో కలిగే ఆత్మానందమే అమూల్యమైన బహుమతి—ధనవంతుల జాబితాలో చేరాలన్న కోరిక ఎందుకు బాధించాలి ? సంఘాన్నే పతాకంగా ధరించి సాగిపోయే సిపాయిలం. సామాన్య జీవితంలో ఉన్నత లక్ష్యాలను పొందాలన్నది మన ఆదర్శం. నిజమైన కళాకారుడు స్వార్థ పూరిత జీవితాన్ని గడపడానికి యిష్టపడడు. కృత్రిమత్వాన్ని అసహ్యించుకుంటాడు. అప్పుడే ప్రతి కళాకారుడూ ఇక్బాల్‌గా మారుతాడు. 23

మన ప్రగతిశీల రచయితల సంఘం కొన్ని విశిష్ట సిద్ధాంతాల ప్రాతిపదికగా నూతన పద్ధతులను ఆచరణలోకి తెచ్చింది. సాహిత్యాన్ని కృత్రిమంగా విలాసంగా చేయడం కోసంకాదు. అందంగా అర్థవంతంగా చేయడానికి. ఈ ఆదర్శంతో భాష నిరాడంబరంగా మారుతుంది.

సామాన్య ప్రజల మీద సానుభూతి కలవారు సరళ శైలిలోనే రచిస్తారు. దేశంలో ఉదాత్తమైన ఉద్దేశాలుగల సాహిత్యాన్ని సృజించి వికసింపచేయడం మా ధ్యేయం. నియమపూర్వకమైన సాహిత్య చర్చలు జరిపి నిగూఢ విషయాలపై ఉపన్యాసాలు యిప్పించి, వాళ్ళ విమర్శలతో సాహిత్యమంటే ఏమిటో తెలియజెప్పాలి. అప్పుడే సాహిత్యంలో నూతన యుగారంభానికి అనుకూల వాతావరణం ఏర్పడుతుంది

దేశంలోని ప్రతి భాషలోను మన సందేశం అందించేందుకు అన్నిచోట్ల మనం మన సంస్థని నెలకొల్పాలి. దేశంలోని సాహిత్య సేవకుల హృదయంలో ఐకమత్య భావనలు నిండుగా ఉన్నాయి. ప్రతి భాషలోనూ ఈ ఆదర్శం నాటి వాటి లక్ష్యాలసాఫల్యానికి కృషి చేయడం మన కర్తవ్యం.

ప్రస్తుతం సాహిత్యకారుల్లో సృజనాత్మక క్రియా శక్తి లోపించింది. ఈ అంశంపై దృష్టిసాధించకుండా ఉండలేము. ఇప్పటివరకు సాహిత్యానికి ఉన్న ఆదర్శాలకు సృజన అవసరం లేకపోయింది. కేవలం మనోరంజనానికి పరిమితమై జోలపాడి నిద్రపుచ్చి కన్నీర్ను కార్పించి దానితో గుండె తేలిక పర్చడమే పనిగా సాహిత్యం ఉన్నంత వరకు క్రియా శక్తితో అవసరంలేదు. గత సాహితి ఆవేశం ఉన్మాదం లాటిది ఫలితం మాత్రం ఇంకొకరిది. కాని మన సాహిత్య ఉద్దేశం వేరు. మన గీటురాయి మీద సాహిత్యానికి మెరుగు పెట్టాలి.

ఉన్నత భావాలు, స్వతంత్ర ఆలోచనలు, సౌందర్యారాధన, ఆత్మ వికాసం జీవిత యదార్థఘటనలు, అందులో ఉంటాయి. అవే మనలో ఉత్తేజాన్ని సంఘర్షణల్ని, ఆదర్శాల్ని సృష్టిస్తాయి. అవి నిద్రపుచ్చడానికి ప్రయత్నించకూడదు.

అధిక నిద్ర మృత్యువుతో సమానం కదా ?

—ooo—

# దేవుడు—అమ్మ

బాధల భాండాన్ని
బాబాలు బ్రద్దలు చేయలేరు,
కష్టాల కడగండ్ల నుండి
బాబాలు కడతేల్చలేరు!!

అమ్మల గన్న అమ్మని 'అమ్మ'
ముగురమ్మల మూలపు 'టమ్మ'ని
డబ్బా వాయించుకునే-'అమ్మో-రమ్మ'
నీకూ, నాకూ ఈ విశ్వానికీ అమ్మ?

ఎవడెవడు దేవుడు ?
నన్ను మించిన దేవుడా ఆ దేవుడని
ఆ దేవుళ్ళను తిట్టిందీ
ఈ 'దేవు-డమ్మ'!

-యన్నంరెడ్డి వెంకటరెడ్డి

# ముందుకే.... 24

గడియారంలోని
ముల్లును వెనక్కి తిప్పి
కాలాన్ని వెనక్కి తిప్పానని
అనుకుంటే
నీ పిచ్చి

కాలాన్ని వెనక్కు తిప్పడం
నీకే కాదు
ఎవరికీ సాధ్యం కాదు
కాలాన్ని చూసి నేర్చుకోవాలి.

కాలం అడుగు
ఎప్పుడూ ముందుకే....

—జింబో

వియత్నాం గీతం

# చి లాంగ్ ద్వారం

మూలం — లెడ్‌క్‌థో

ఆదారి–చిలాంగ్‌దాకా పర్చుకున్న–ఆ దారి
ఆకుపచ్చని పొదల్ని మొగ్గలేస్తున్న తెలి
మబ్బుల్ని
ఎండలో మెరిసి మురిసిపోయే బంగారు
రంగు పొలాల్ని
పొదవుకుంటూ– ఆ దారి
నిజంగా ఇది ఒకప్పటి యుద్ధభూమేనా?
ఉత్తరాన శత్రువు చావుదెబ్బ తిన్నదీ
చోటేనా?
ఆ ఆనందాల రోజుని మళ్ళీ యివాళ
మహదానందంగా స్మరిస్తున్నా–
ఈ కొండల్ని నదుల్ని తన్మయుణ్ణై నేను
వీక్షిస్తుండగానే
వెయ్యేళ్ళు దొర్లిపోయాయా?
మళ్ళీ నాకంటి కగబడేంత తెగువవచ్చిం
దా శత్రువుకి?
వసంతం వియత్నాం నిండా ఎంత
అందంగా పూచింది?
ప్రతి ఎర్రని చివురుకొనా అద్భుత
సాహస గాథల్ని
విప్పుకుంటూ వెడుతుంది–
అదిగో చూడు
ఆ నదిని
దాటుతున్న సైనికుల్ని
మూసిన బరువు మూటల్ని మోసుకుంటూ
అరుణ పతాకాల రెపరెపల నినాదాల్తో
కొండల శ్రేణుల్ని, అగణిత లోయల్ని
పిలుస్తూ తట్టి లేపుతూ
ఆ సంజ వెలుగులో గాలి ఊసుల గుస
గుసలువింటూ
ఎంతతొందరగా సాగిపోతున్నారో?!
ఇదిగో బీజింగ్ దురాశ పిశాచాల్లారా
మీ సామ్రాజ్య విస్తరణలు బొగ్గు
లౌతాయిరా
మించి పోలేదు మరొక్కసారి నెమరు
వేసుకోండ్రా
గతంనాటి చి–లాంగ్ పాఠం
ఇం కొంటికి బుద్ధి చెప్పండి
అదే ఇప్పుడు మీ చేతనయేది
ఏమిటీ మళ్ళీ వస్తారా?
మీతరం గాదురా–
వినరు కదూ–సరే–
ఈ రోజు మీ స్మృతుల్లో ఆరని చితిగా
తగలడుతుంది
మీరిక వెళ్ళరు.
తిరిగిరావడ మెక్కడ?
ఈ నేలే ఒక గీతం
"నేను ప్రేమించే ప్రతి ఒక రూరండి
నాతో లాంగ్‌సాన్‌కి అహ్య్యా తోధి సన్ని
ధికి – టామ్ థాన్ పగోడాకి" మన
ప్రియమైన ఈ భూమి పవిత్రతని ఇలాగే
నిలుపుకుందాం.

అను: — నల్లిక్

1. 13వ శతాబ్దంలో చిలాంగ్ మార్గం వద్ద చైనా జనరల్ ఒకడు వియత్నాం చేతుల్లో ఘోరపరాజయం పొందాడు.

2. ఒకస్థలగాధ. తోధి అనే పవిత్రమైన యువతి భర్తకోసం ఎదురుచూస్తూ అందమైన శిలగా మారిపోయింది (ఇక్కడ అహల్య పదం అనువాదకుడు చేర్చింది).

ఈ కవి లెడక్ థో-ప్రపంచ శాంతికి నోబుల్ బహుమతినిస్తే తిరస్కరించి- "కిసింగర్‌తో బాటుగా ఈ బహుమానం నేను పంచుకుంటానా?" అని ప్రశ్నించినవాడు.

—ooo—

# నా ఊహలలో

బూర్జువాల పాద ప్రహసనాల
నలిగి నలిగి నశించే
గట్టి గడ్డి పోచ మరి
ఊచకట్టుగా, కట్టి కలిసింది
నలిపే, నలిగించే వారల
చుట్టి కట్టి వేసింది.

చెత్త బుట్టలో చిల్లిపెంకు,
గొప్ప సమరాయుధమై
చెలరేగింది
హింసాద్వేషాల, అవి నీతుల
హతమార్చి వేసింది

అధోలోకాన వామనుడు.
ఉన్నతుడై, మహోన్నతుడై
లోకాలన్ని ఆక్రమించాడు.
బూర్జువాల్ని పాతాళాన్కి త్రొక్కేశాడు.

—ఉషాచంద్ర

# రసూల్ గంజాతవ్

## కవితలు

మనిషిని మట్టుపెట్టాక
వాడి దుర్గతికి దుఃఖిస్తాను
వధించే ముందు
కేవలం ద్వేషిస్తాను.



ముని పుంగవుడు కాడతడు
మానవాతీతుడూ కాడు
కాని-మోకరిల్లు మాతనికి
మనుష్యుడా తడు

ఇది నీ కొరక విశ్రాంతి మందిరము
ఆవేదనలు తీర్చు ప్రశాంత వనము
మంచి స్నేహితునిగా ప్రవేశించు
శాశ్వత మిత్రునిగా నిష్క్రమించు

అను : వసంగాదేవి

**కథానిక** — సన్నివేశం

సమయం—

తెలుగుదేశం జై ఆంధ్రా ఉద్యమంలో ఉడికిపోయి కోలుకొంటున్న తరుణం— మెల్ల మెల్లగా రైళ్ళూ బస్సులూ దారులు సరిచూసుకుంటూ నడుస్తున్నాయి. ప్రజలు ఊపిరి గట్టిగా పీలిస్తే ఎవరైనా ఉద్యమం అనుకుంటారేమోనని పట్టిపట్టి శ్వాస వదుల్తున్నారు. విద్యార్థులు మరిచిపోయిన పుస్తకాలపేర్లు మళ్ళీ గుర్తు తెచ్చుకుంటున్నారు. ఉపాధ్యాయులు 'సిలబస్‌లు ఎక్కడ వదిలి పెట్టారో' గుర్తు లేక పేజీలు తిరగేస్తున్నారు. నాల్రోజులు కళాశాలలు సవ్యంగానడిస్తే వెనకటి బకాయిల్తోసహా జీతాలొస్తాయేమోనని ఆశగా ఎదురుచూస్తున్నారు. అధికారులూ, తల్లితండ్రులూ, విద్యావేత్తలూ, పురప్రముఖులూ, సంఘసేవకులూ, రాజకీయ నాయకులూ, ముక్తకంఠంతో విద్యాసంవత్సరం కాపాడమని పిలుపిచ్చారు. పిలుపు మేరకు కళాశాలల ఉపాధ్యాయ సంఘం వేసవిలో కూడా పని చేయటానికి నిర్ణయించి [illegible]

[illegible]

నీళ్ళు కుండలు కుండలు ఖర్చయి పోతున్నాయి.

అన్ని ప్రభుత్వాల్లాగానే తెలుగు ప్రభుత్వానికికూడా ఏ ప్రజా సమస్యనీ సవ్య పరిస్థితుల్లో పరిష్కరించటంలో నమ్మకం లేదు. ఎవరైనా సమ్మెగాని ఆందోళనగాని చేస్తే తప్ప సమస్యను 'అధ్యయనం' చేయటం ఆరంభించరు. సమ్మె చేస్తున్నప్పుడు పరిష్కారం ప్రకటిస్తే 'లొంగిపోవటం' అవుతుంది కనుక 'చూస్తాం, ముందు పనుల్లోకి రండి' అంటారు. పనుల్లోకిపోతే సవ్య పరిస్థితి మళ్ళీ మంచుగడ్డలా ఘనీభవించేస్తుంది. అనక ఏ ప్రజా నాయకుడన్నా 'ఆవిషయం' గూర్చి ఏంచేశారని ప్రభుత్వ ప్రతినిధుల్ని అడిగితే 'ఏ నాయకుడు— ఏవిటా విషయం....పొండి, పొండి చూద్దాంలే' అని శూన్యహస్తం ఆశీర్వదిస్తుంది ఈ బాగోతం బాగా 27 అర్థం చేసుకున్న ఏ వృత్తి సంఘమైనా 'తరుణం' బాగోగులు ఎంచి చూసుకుని, పొంచి కూర్చుని సమ్మె ప్రకటించి, సహాయ నిరాకరణ గావించి ప్రభుత్వ యంత్రాంగాన్ని స్థంభింప చేయాలని కోరుకుంటారు. ఎవరి పరిభాషతో వారికి మాటలునేర్పాలని తీర్మానించుకుంటారు.

[illegible]

వేటు యాజమాన్యాలవారి క్రింద మరీ దారుణ పరిస్థితి ఉన్నమాట వాస్తవం. జీతాలురాక ఆలి పుస్తెలు తాకట్టుపెట్టే వాళ్ళొకరూ, ఇచ్చేది చాలక అప్పుల్లో

— డా॥ చందు సుబ్బారావు

పెరిగిపోయే వాళ్ళు మరొకరూ. ఎప్పుడు తీసివేస్తారో తెలియక 'డెమొకిల్స్' కత్తి క్రింద నిద్రపోయేవాళ్ళొకరూ, యాజమాన్యం వారి ఇష్టానుసారంగా జరిగే దినవారీ పరిణామాల్ని ఎదుర్కో లేక నలిగే వాళ్ళొకరూ. పెంచుతామన్న జీతాలు రాక, ఇస్తామన్న అలవెన్సులు ముట్టక చాలా కాలం ముదిగిపోయిన కళాశాలల ఉపాధ్యాయులు 'తరుణోపాయంగా' ఆ ఏడు పరీక్షలు నిర్వహించమనీ, పేపర్లు దిద్దమనీ "సమయానికి" అడ్డం తిరుగుతున్నట్లు ప్రకటించారు. ముదిరిన ఎండలు రోహిణీ కార్తిలో ప్రవేశించాయి.

సమ్మెలో, ఆందోళనల్తో వేగలేక వేగిపోయి వాడిపోయున్న ప్రభుత్వం "ఇది దారుణం, అక్రమం, తెలుగు దేశ పరిస్థితికి తీరని ద్రోహం. ఉపాధ్యాయుల ప్రవర్తనకు గొడ్డలిపెట్టు, నియమావళికి విరుద్ధం.. కనుక సమ్మె నిషిద్ధం.... ఖబడ్దార్..." అని ప్రకటించింది. ఉపాధ్యాయులు తమ తీర్మానం మేరకు పరీక్షల్లో సమ్మె చేయటానికి మూటా ముల్లె సర్దుతున్నారు. "ఇప్పుడు తప్ప ప్రభుత్వం మాట దక్కించదు" అని త్రికరణశుద్ధిగా నిర్ణయించుకున్నారు. అటు తల్లిదండ్రులూ పుర ప్రముఖులూ చావబోతున్న విద్యాసంవత్సరం కొన ఊపిరితో ఉన్న తరుణంలో మళ్ళీ ఈ కొత్త పరిణామం "ఏమిటనుకున్నారు" "అయితే ఇచ్చేది ప్రభుత్వం పుచ్చుకునేది వాళ్ళు. వాళ్ళు సంతోషంగా ఉంటే తప్ప తమ బిడ్డలకు పరీక్షలూ, అక్షర దానాలూ సవ్యంగా జరగవు. మనకెందుకు వేచిచూద్దాం" అన్నట్లు మౌనంగా ఊరుకున్నారు.

ముహూర్తం గ్రీష్మ భాస్కరుని ఉదయ కిరణంలా ప్రకాశించింది. పరీక్ష తేదీలు ప్రశ్న పత్రాలూ, కళాశాలల నిర్వహణ సామాగ్రి అన్నీ సిద్ధమయ్యాయి. జరిగితే వచ్చింది రొద్దాం ... జరక్కపోతే తమాషా చూద్దాం...పైగా మన మేస్టర్లే పరీక్షలు జరపమంటుంటే మనకేం....బలే బతేగా ఉంది.... మేస్టర్లకి ఐక్యతకూడా ప్రకటిద్దాం' అని నిర్ణయించుకున్నారు విద్యార్థులు....

28

"మా బ్రతుకులు సవ్యంగా జరగటానికి మాత్రమే కడసారి ఆయుధంగా ఇలా చేస్తున్నాం...విద్యార్థుల్ని ఇబ్బందుల్లో పెట్టి వారికి నష్టం కల్గించటం ఎంత మాత్రం మా అభీష్టం కాదు...సహృదయతతో మమ్మల్ని అర్థం చేసుకుని సహకరించండి" అని ప్రకటించారు ఉపాధ్యాయులు!

"ఏది ఏమైనా పరీక్షలు జరిగితీరుతాయి...పోలీసుల రక్షణలో రెవిన్యూ సిబ్బందితో పరీక్షలు నిర్వహించవలసిందిగా" ప్రిన్సిపాల్స్‌కు ఫర్మానాలందాయి...దాదాపు ప్రతి కళాశాలనూ కలెక్టర్లూ, సబ్ కలెక్టర్లూ స్వాధీన పరుచుకున్నారు. యంత్రాంగం సిద్ధమైంది. మరురోజునుంచీ పరీక్షలు.

స్థలం—

కోస్తా ఆంధ్రలో విజయవాడ దగ్గర ఓ పట్టణంలోని ఓ కళాశాల గేటు.... మొదటి పరీక్షకు అరగంట ఇంకా టైముంది.

ఉపాధ్యాయులు గేటు కడ్డంగా నిలబడి విద్యార్థులతో చర్చలు జరుపుతున్నారు. "ఎవర్నీ అటకాయించటానికి వీల్లేదని" పోలీసు అధికారులు ఆర్డర్సు ఇచ్చి పరిస్థితి పర్యవేక్షిస్తున్నారు. విద్యార్థుల్లో అత్యధిక భాగం "మేం మీతో నే ఉంటాం అని బయట నిలబడ్డారు. అధికారులూ, అస్తిపరులూ, పలుకుబడి ఉన్నవాళ్ళూ తమ పిల్లల్తో వచ్చి "లోనికిపోనియ్" మన్నారు. ఉపాధ్యాయులు "కొంత అడ్డగించారు. కాని, పోలీసుల సహాయంతో వాళ్ళు లోనికి ప్రవేశించి పరీక్ష హాల్స్ లోకి వెళ్ళిపోవటం జరిగింది....అప్పుడే వచ్చి పరిస్థితిని గమనిస్తూ నిలబడ్డ ఓ మధ్య వయసు రైతు తన కొడుకుతో 'లోపలికిపో' 'పోయిరాయి'అని పెద్దగా అన్నాడు.... అతని బట్టలు కొంచెం మాసిపోయాయి. ముహంలో కోపం ఛాయలు కన్పిస్తున్నాయి, గడ్డం పెరిగి వయస్సును ఎక్కువగా చూపిస్తుంది.

'ఇంతవరకూ పెద్ద పెద్ద వాళ్ళ బిడ్డలు కారుల్లో వచ్చి లోపలికి వెళ్ళటం' గమనించిన ఉపాధ్యాయ నాయకులు 'నువ్వు కూడానా' అన్నట్లు అతనికేసి చూసారు. వాళ్ళను పట్టించుకోనట్లు కొడుకు వేపు తిరిగి ఆయన మళ్ళీ 'పో-నిలబడ్డావేం' అన్నాడు. 'ఇటు కన్న తండ్రి...అటు రోజూ చూసే గురువులు...' బలిపీఠం ముందు మేకలా కుర్రాడు రెండడుగులు ముందుకూ, ఒకడుగు వెనక్కీ వేశాడు.

ఉపాధ్యాయ నాయకులు ముందు కొచ్చి 'చూడండి... మీ అబ్బాయి ఇవ్వాళ కాకపోతే రేపు తప్పకుండా పరీక్షలు రాస్తాడు. పరిస్థితి గమనించండి....' అన్నారు. ఆయన గొంతు పెగిల్చి...

'ఏమిటి పరిస్థితి....మీరు సమ్మె చేస్తే, మావాడెందుకు మానెయ్యాలి.... మేమెందుకు సమర్థించాలి...మావాడు29 వెళ్ళి రాయాల్సిందే'....గట్టిగా అన్నాడాయన.

'అంటే మీ యిష్టమే నన్నమాట... ఎలా వెళతాడో చూస్తాం...' ఉ. నాయకులు :

'ఎలా వెళ్ళడో నేనూ చూస్తాము.... నెలకు వెయ్యి రూపాయలు తీసుకుంటున్న మీకు జీతాలు పెంచవల్సి వచ్చాయి. కూటికీ, గుడ్డకీ నోచుకోని పేదోళ్ళు...రైతు కూలీలు ఎన్నిసార్లు సమ్మెలు చేసారు....ఎన్నెన్ని లాఠీ దెబ్బలు తిన్నారు...ఒక్కసారైనా మీరు గొంతెత్తి అన్యాయం అన్నారా...తెల్ల బట్టలేసుకుని స్కూటర్ల మీద పరుగె

త్తారు...ఎవడు మీకు సంఘీభావం ప్రకటించాలి....ఎందుకు ప్రకటించాలి.. ఇదిగో మీ మేస్టర్ రామకృష్ణారావుగారిది మావూరే. ఈయనకు పదెకరాలు భూమింది.. ఈయన పెళ్ళానికి పదెకరాలుంది...కూలోడికి అయిదు రూపాయిలిమ్మంటే, కాదు మూడిస్తానంటాడు. పైగా ఇక్కడ వచ్చే వెయ్యిరూపాయిలు చాలక సమ్మె చేస్తున్నాడా..."

ధారావాహికంగా వస్తున్న అతని గొంతులోని మాటలు గుండెల్లోకి చొరబడుతున్నాయి...పోలీసులు మహదానందంగా వింటున్నారు.

'అందరూ రామకృష్ణారావులు లేరుగదండీ...' ఓ. నాయకుడు...'లేరు.... అందుకే కార్లున్న వాళ్ళ పిల్లలు లోపలికెళ్ళారు.. కాలినడక వచ్చిన వాణ్ణి మీరు అటకాయిస్తున్నారు. మీ మీద అధికారులు దమనకాండ జరిపితే మేం ఖండించాం. పేదవాళ్ళ సమస్యలు ఏవొచ్చినా మీరు మౌనం వహించారు.. పాకీదొడ్లు ఊడవలేదనీ, రిక్షాలు తిరగడం లేదనీ, బస్సులు సమయానికి నడవలేదనీ అసౌకర్యాలకు విసుక్కున్నారు... పెద్దోళ్ళలాగా మాట్లాడారు. ఈ వేళ చావు బతుకుల సమస్య వచ్చిందని సంఘీభావం అంటున్నారు. ఎవరితో సంఘీభావమో ! మీరు అడ్డగించే ఈ కుర్రాళ్ళ తల్లి తండ్రుల్లో ఏ ఒక్కడికి మీ జీతాలు మాత్రం కూడా రావని మీరు గమనించరు....ఎందుకు ఆగాలి....మా బ్బాయి పరీక్షరాయాల్సిందే....పోనీయండి.—'

'అదిగాదు..ఆగండి..'

'వదులు చెయ్..తియ్యడ్డం..కుర్రాడికి అడ్డొస్తే మర్యాదగా ఉండదు...' ఆయన గొంతు తీవ్రంగా హుంకరించింది !



చేతులు అడ్డం తొలిగాయి.

అతని మాటల కేదో అర్థం ఉన్నట్లు కొందరికనిపించింది. అతని ధైర్యం. నిర్మొహమాటం చాలా మందిని ఆకర్షించింది.. మరికొందరికి 'ఎవడీ బేవార్సు గాడు' అనిపించింది!!

ప్రేక్షకుడుగా నిలబడ్డ నాకు మాత్రం— ఈ సన్నివేశాన్ని కథ రాసేప్పుడు తటస్థంగా ఉండిపోవాలని గుర్తుకొచ్చింది!

---

## సాహిత్య సమాచారం

కవిత్వ పరిశీలన అనాదిగా జరుగుతున్నదే. ఇటీవల ఆధునిక కవిత్వ రూపురేఖల గురించి చర్చలు విస్తృతంగా జరుగుతున్నాయి. తెలుగునాట అన్ని సాహిత్య ప్రక్రియలకన్నా విమర్శ చాలా అధ్వాన్న స్థితిలో ఉందన్న వాస్తవాన్ని ఎవరూ కాదనలేరు. కవిగా, కథకుడుగా, విమర్శకుడుగా బహు పాత్రాభినయం చేయగల వాళ్లు ఆంధ్రలో చాలామంది ఉన్నారు. వీళ్ళు ఒక విధంగా చెప్పాలంటే సర్వజ్ఞులే! పత్రికల పుటలమీద పరవళ్లు తొక్కుతూ ఈ కవి-కథక-విమర్శకాగ్రేసరులు తమకు ఇష్టమయిన వాళ్లే అసలైన సిసలైన ఆధునిక, అభ్యుదయ, విప్లవ రచయిత అని చక్రాంకితాలు వేస్తారు. ఏ కారణం చేతనైనా తమకు నచ్చని వాళ్ళను ఈసడించడమో, విస్మరించడమో చేస్తారు. తమకు నచ్చని కవితలన్నీ అకవితలే! అందులో రాజకీయ ప్రచార దుర్గంధం మాత్రమే వీళ్ళ నాసికాపుటాలకు విందు చేస్తుంది. ఈ అకవితా విషవాయు ప్రసరణాలు భరించలేమంటారు. సాహిత్యం ఎలాఉండాలో, ఎలాఉండరాదో నిర్ణయించేఅధికారాన్ని హస్తగతం చేసుకున్న కొంతమంది పెద్దలు (కవి చౌడప్పకింద పద్యపాదం గుర్తుకొస్తే క్షమించాలి) పీఠా సాహిత్య పీఠాలను అధిష్టించి ఇస్తున్న యోగ్యతా పత్రాలు చూస్తుంటే ఏడవాలో, నవ్వాలో తెలియడంలేదు. తమ కీర్తిగానం చేయడానికి పనికివస్తారనుకున్న రచయితలను ఆకాశానికెత్తడంతో తనివితీరక, తెలుగునాట కవిత్వం పురుగునాకి పోయిందని సామూహిక కుకవి నింద సాగిస్తారు. అలాంటి అధ్వాన్న పరిస్థితుల్లో ఈ యువసాహిత్యకారుడు బాలార్కుడుగా పొడిచాడని ప్రశంసిస్తారు. ఈ ప్రశంసకు బదులుగా ఆ యువరచయిత జీవితాంతం పీఠాకర్తకు విశ్వాసపాత్రుడుగా ఉండాలని ఆశిస్తారు. మరికొందరు అత్యాధునికులు అర్థమయ్యేదేదీ కవిత కాదు పొమ్మంటున్నారు. ఆలోచనామృతంగా ఉండాలని. తరచేకొద్ది నూత్న భావాలు స్ఫురించాలని అలా కాకుండా తేటతెల్లంగా తెలిసిపోయేటట్లు రాస్తే అది కవిత కాదని కూడా భంగ్యంతరంగా సెలవిస్తున్నారు. అయ్యా! మీ కవిత అర్థంకావడం లేదంటే, మీ స్థాయి పెరగాలి! మీ సంస్కారం ఎదగాలి! అప్పుడే మా కవితా శిఖరాలను కొంతవరకయినా అందుకోగలుగుతారన్న తీరులో సమాధానాలు ఇస్తున్నారు. విచిత్రమేమిటంటే ఇలాంటి సాహిత్యకారులంతా గురజాడను నవయుగ వైతాళికుడని పొగుడుతారు. కాని, ఆయన 'దేశభక్తి' గేయంలో కవిత్వం ఉందనిమాత్రం లోలోపల అంగీకరించరు.

"దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా

వట్టి మాటలు కట్టి పెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్"

ఈ చరణాల్లో ఏం కవితాభావం ఏడ్చింది? శుష్క నినాదాలుతప్ప! అని మనసులో అనుకుంటూనే బయటికి గురజాడ మహాకవి, మహామనీషి అంటూ ఉరుముతారు. అలాగే శ్రీశ్రీ కవిత్వం విషయంలోకూడ ద్వంద్వ ప్రవృత్తిని ప్రదర్శిస్తారు.

"ఏదేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
నరజాతిచరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం"

ఇలాంటి కవితను కాదనే ధైర్యంలేక పైకి ప్రశంసించినా అంతరంగంలో అందుకు తలకిందులుగా భావిస్తున్నారని దానికి ఈ విమర్శకులు మెచ్చుకుంటున్న, లేక స్వయంగా రాస్తున్న కవితలే నిదర్శనం. అన్ని సామాజిక విలువను ధ్వంసం చేయాలన్న కవిని, జుగుప్సాకరమైన బూతుల బురదలో కూరుకపోయి అందులోనే చందన సుగంధాలున్నాయనుకుంటున్న సాహిత్యకారులను ఆధునిక సాహిత్యానికి ప్రతీకలుగా భావించే విమర్శకులు గురజాడ, శ్రీశ్రీల సాహిత్యాన్ని ఎలా, ఎందుకు ప్రస్తుతిస్తున్నట్లు? ఈ నాటి తెలుగు సాహిత్యరంగం రభసచేసే వారిదే రాజ్యం అన్నట్లుగా తయారైంది. సమ్యగ్దృష్టి స్థానాన్ని పాక్షికత్వం ఆవహించింది. 32

సకల సంప్రదాయ నిరసనం విప్లవ సంప్రదాయంగా కొంతమంది ప్రవచిస్తున్నారు. అభ్యుదయ రచయితల ఉద్యమంమీద బురదచల్లేందుకూ, అపార్థాలు కల్పించేందుకు నానారకాల అతివాద వాగాడంబరులూ, పచ్చి మితవాదులూ ఏకమై గందరగోళం సృష్టిస్తున్నారు. కొత్తదనం పేరుతో వంటబట్టని విదేశీ కవిత్వాన్ని తెలుగులో వాంతిచేసుకుంటూ—ఆధునికత అంటే అలా ఉంటుంది అంటున్నారు. వ్యక్తావ్యక్తాలాపన్నే, ప్రేలాపన్నే కవిత్వమని ప్రేలుతున్నారు. అస్పష్ట అయోమయ కవిత్వమే అసలయిన ఆధునిక కవిత్వమని చెబుతున్నారు. 'పాతకొత్తల మేలుకలయిక' పనికిరాదని పాతంతారోతగా భావించి ధ్వంసించాలంటున్నారు. నిన్నను నేడు, నేటిని రేపు, రేపును ఎల్లుండి పూర్తిగా తుడిచిపెట్టాలన్నమాట! గతంలోని ఉత్కృష్టమైన అంశాలన్నీ వర్తమానంలో కొనసాగుతాయని, సరికొత్తది ఏదీ ఈ లోకంలో ఉండదనీ ఈ కుహనా ఆధునిక వాదులకు బోధించాలనుకోవడం శ్రమ దండుగే అవుతుంది.

—సత్యం

కథానిక

# "కీర్తి కండూతి"

అనగనగా ఒక రాజుగారికి ఏడుగురు కొడుకులూ వేటాడి తెచ్చిన ఏడు చేపల్లో ఏడోది మాత్రం యెండక పోవటం, 'చేపా చేపా ఎందుకు ఎండలేదు?' అని రాకుమారులు తీగలాగితే డొంక కదలటం - షరామామూలే.

ఆపైన—

ఎండని చేప సృష్టించిన సమస్యలతో రాకుమారుల్ల బుర్రలు వాచిపోయాయి. వాళ్ళకు వేటమీద, జీవితం మీద విరక్తి కలిగింది. ఇలా కొంత కాలం గడిచాక ఒకనాడు వాళ్ళు ఎవరో పెంచిన ఒక సాహితీ వనంలో అడుగు పెట్టారు. అక్కడి సాహితీ సౌరభము వారి సేదదీర్చి, విశ్రమింప జేసింది. దానితో—వారు సాహితీ వన ఆవశ్యకతను గుర్తించిన వారై తామే ఒక సాహితీ వనాన్ని స్థాపించాలని అప్పటి కప్పుడే నిర్ణయించారు.

అంతఃపురం చేరి అర్జెంటుగా కుల గురువును వివరాలడిగేరు. మూడుకిలోల సామ్రాణి మింగి త్రికాలవేది నోరు విప్పాడు. 'ఏడేడు సముద్రాల కివతల ఒక సాహిత్య ద్వీపం, ఆ ద్వీపంలో భయంకరమైన ఒక ఊడలమర్రి. ఆ మర్రి తొర్రలో ఒక ఋషి, ఆయన అనుగ్రహం పొంది ఆ దీవిలోని సాహితీ ప్రక్రియలు: ప్రణాళికా విత్తనాలు, ఆర్థిక ఎరువులు, సంచలిత నీరు, రక్షక పాకల్లాటి సరంజామా తీసుకు రాగలిగితే మంచి సాహితీ వనాన్ని స్థాపించ వచ్చునట!'

అదెంత పనని అనుకున్న వారై, ఏడుగురు రాకుమారులు ఓ శుభ ముహూర్తాన తల్లిదండ్రుల ఆశీర్వాదం పొంది ఏడు సంచులు తీసుకుని సాహితీ ద్వీపానికి ప్రయాణం కట్టారు తమ విధి నిర్వహణ విన్యాసాలతో ముందుకు సాగారు.



అలా కొంత దూరం పోయాక, మొదటి వాడు నిట్టూర్చాడు. ఇంకొంచం దూరం పోయాక రెండో వాడు ఆవులించాడు ఇంకా కొంచెం దూరం పోయాక మూడో వాడు నడక మందగించాడు. మరి కొంత దూరం సాగాక నాల్గోవాడు నడక మానేశాడు. తర్వాత ఐదోవాడు అలసటని చెప్పి ఒకచోట ఆగిపోయాడు. ఆరోవాడు మెజారిటీ వైపు మొగ్గాడు.

అంతవరకూ ఏకధాటిగా నడుస్తున్న ఏడో వాడు మొదటిసారిగా వెనుదిరిగి చూశాడు చూస్తే ఏముంది? తను వొంటరి వాడై పోయాడు.

క్షణంపాటు కళ్ళు మూసుకుని, కుల

— జి. వి. రమణారెడ్డి

దేవతను తలుచుకుని ఏడో రాకుమారుడు గమ్యం వేపు సాగిపోయాడు.

దారిలో పడరాని పాట్లు పడ్డాడు. రెండు చోట్ల శాప గ్రస్తుడయ్యాడు మళ్ళీ శాప విముక్తుడయ్యాడు. (రాకుమారులకు యిది మామూలే). ఎలాగయితేనేం చివరకు తను మోయగలిగినంత సాహితీ సంపదతో రాకుమారుడు తిరిగి నగరును చేరుకున్నాడు.

తను తీసుకువచ్చిన ఒకే ఒక ప్రణాళికా విత్తనాన్ని నాటి, ఆర్థిక ఎరువువేసి, రక్షక పాదుచేసి, సంచలితనీటిని పోసి, అహర్నిశలూ ఆ విత్తనాంకురానికి శ్రమ పడ్డాడు.

ఓ శుభోదయాన ఆ ప్రణాళికా విత్తనం మొలకెత్తింది, రాకుమారుని ఆనందానికి పట్టపగ్గాలులేవు. మొలక కొమ్మ వేసింది రాకుమారుని ఆనందానికి అవధులు లేవు కొమ్మ మొగ్గ తొడిగింది. రాజకుమారుని ఆనందం ముందు ఏదీ సాటిరాలేక పోయింది.

రేపు మొగ్గ విచ్చుకుంటుంది దాని సౌరభం జగమంతా నిండిపోతుంది. ఆ సౌరభాన్ని స్వయంగా విస్తరింపజేసి సాహితీ ప్రియుల ప్రశంశలు పొందుతాను -అనుకున్నాడు రాకుమారుడు.

ఆ రాత్రికి ఆ మొక్క ప్రక్కి దే పడుకున్నాడు. ఇన్నాళ్ళూ అనుభవించిన నిద్ర లేమిని తీర్చుకున్నాడు. ఆ నిద్రలో ఒక కలకూడా కన్నాడు.

తను యింత కాలం శ్రమించి, పండించిన సాహితీ పంటను ఎవరో ఆరుగురు దుండుగులు వచ్చి దోచుకోబోయారట! తను ధైర్యంతో ఎదుర్కొన్నాడట. వాళ్ళు తన ధాటికి ఆగలేక వెనుదిరిగి పారిపోయారట! తను విజయంతో దిక్కులు పిక్కటిల్లేటట్లు నవ్వాడట.

నవ్వుతున్న రాజకుమారునికి మెళకువ వచ్చింది. కళ్ళుతెరిచి చూసుకునేసరికి తను సాహితీ వనానికి దూరంగా ఓ చిన్న మురుగ్గుంటలో కాళ్ళూ చేతలూ కట్టివేయబడి పడివున్నాడు.

అతి కష్టంమీద కట్లు విప్పుకుని సాహితీ వనానికి పరుగెట్టిన రాకుమారుడా మొక్కను చూసి నిలువునా కూలిపోయాడు! 34

మొక్క టోసి పోయింది!!

"దిగులు పడకు!" మొక్క జాలిగా అంది.

"కష్టమొకరిదీ, ఫలితమొకరిదీనా?" అన్నాడు రాకుమారుడు.

"నాదేం తప్పు లేదు" అందిమొక్క

"నీ తప్పుకాదు-నా ఖర్మ"

"ఎక్కడికి అలా వెళ్ళిపోతున్నావు"?

"ఎక్కడికో - సాహితీ సేవకు మాత్రం కాదు,"

"అదేం?"

"జరిగింది చూశావుగా! వ్యధా ప్రయాస నాకెందుకూ?"

"అలా నిరాశపడకు వంటవాడికి రావలసిన మెప్పు వడ్డించేవాడికి ఎన్నడూ పోదు"

"అంటే"

"కీర్తికండూతి చోరులకు వుంటుంది, పోషకులకు కాదు. నీవు పెంచే సాహితీ మొలక నిన్ను పెంచుతూనే వుంటుంది. నీకు తెలియకుండానే తన ప్రతిఫలాన్ని సమర్పించుకుంటూనే వుంటుంది."

రాకుమారుని శరీరం సాహితీ మొలక చిందిన సౌరభంతో గుబాళించింది. కుమారుడు వుల్లాసంగా కదిలాడు

"ఎక్కడికి?" అడిగింది మొక్క

"సాహితీ ద్వీపానికి-మరో ప్రణాళికా విత్తనం కోసం-" అని ముందుకు సాగిపోయాడు.

అంతవరకూ ఆ ప్రక్క పొదలో దాగివున్న అరుగురు రాకుమారులు ఏదో వారి ప్రయత్నంచూసి, తమకు రాబోయే కీర్తిని తలుచుకుని మురిసిపోయారు.

—ooo—



# తిరుగుబాటు!

వూళ్ళనే కూకటి వేళ్ళతో
వూడ్చివేసిన ఉప్పెన వుగ్రతాండవం
అప్పుడే మరచి పోయారా?

అగ్ని తాండవార్భటిలో
శిలాద్రవం కక్కుతూ బూడిద
కుప్పలను పేర్చిన కరాళ కథలను
యింతలోనే విస్మరించారా?

నాశిరః కంపన మాత్రంతో
జనపదాలు దద్దరిల్లిన ఘోర చరిత్ర
మీ స్మృతి పథాల్నుంచి
చెదరి పోయిందా?

ఒట్టి వడగాల్పులకే కనలిపోయి
గూటిలో గువ్వల్లా మసలుకొనే మీరు
నాపై తిరుగుబాటుకు ఎగబడేముందు
మీ యిల్లు చక్కబెట్టుకోండి.

నా ఆగ్రహానికి గురై అలమటిస్తున్న
ఆర్తుల ఆక్రందనాలకు కరగిన
హృదయాలు అందిస్తున్న
స్నేహ హస్తానికి అడ్డుతగిలి
అర్థార్జన గావిస్తున్న ఆకతాయి
మనుషులపై తిరుగుబాటు చేయండి.

కాలగర్భంలో దాగిన నా వాలకం
పసిగట్టేందుకు అగచాట్లు పడేముందు
వూళ్ళేలే పెత్తందారుల అక్రమాలపై
తిరుగుబాటు బావుటా ఎగిరేయండి
ఆపై తాపీగా నా కూపీ తీయటం
అందరూ కలసి ఆలోచించండి.

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# తెలంగాణలో సాహిత్య విమర్శ

ఖండకావ్యం, నవల, కథానిక, ఏకాంకిక, నాటకం— ఆధునిక సాహిత్య ప్రక్రియలు. పాశ్చాత్య వరవడిని మనదేశ భాషల్లో గత శతాబ్దం చివరి భాగంలో విస్తరించాయి. తెలుగులో ఈ ఆధునిక ప్రక్రియలు ఉన్నత స్థాయినందుకుని అభివృద్ధి చెందుతున్నాయి. అయితే ఈ ఆధునిక ప్రక్రియలన్నిటితోపాటు తెలుగులో ఆధునిక సాహిత్య విమర్శ పాశ్చాత్య సాహిత్య సంపర్కం వల్ల ప్రారంభమైనప్పటికీ ఎంత అభివృద్ధి చెందాలో అంత అభివృద్ధిచెంది, ఎలా వికాసం చెందాలో అలా వికాసం చెందలేదు. సాహిత్య విమర్శలో ఏ స్పష్టత ఆవశ్యకమో ఆ స్పష్టత యింత వరకూ ఏర్పడలేదు.

36

ఆధునిక సాహిత్య ప్రక్రియలన్నీ పాశ్చాత్య సంపర్కంవల్ల వికాసం చెందుతూ ఉన్నాయి. కాబట్టి వాటిని విమర్శించే విధానానికి పాశ్చాత్య సాహిత్య సంప్రదాయాలు ఆధారాలు కాక తప్పదు. ఆధునిక రచనలు పాశ్చాత్య పద్ధతులననుసరించి చేస్తున్న రచనలవడాన్ని వాటి మంచి చెడ్డలను నిర్ణయించడానికి ఆయా సాహిత్య ప్రక్రియలననుసరించి ఏర్పడిన ప్రమాణాలను స్వీకరించక తప్పదు. మన ప్రాచీన అలంకార శాస్త్ర ప్రమాణాలతో ఈ రచనలను కొలవడం సమంజసం కాదు. పాశ్చాత్య పద్ధతుల్లోని ప్రమాణాలు ఏఏ తాత్విక సిద్ధాంతాలననుసరించి ఏర్పడ్డాయో ఆయా సిద్ధాంతాల వరకూ ఆయా వాదాల వరకూ అంతరాతీయమైనవి. అందుచేత ప్రపంచంలో అన్ని దేశాల్లోనూ ఆయా వాదాలకూ ఆయా సిద్ధాంతాలకూ ఆ ప్రమాణాల ననుసరించి ఆధునిక సాహిత్య విమర్శ చేయబడుతోంది. అదే కారణంచేత ఆధునిక తెలుగు సాహిత్య విమర్శకూ వాటినే ప్రమాణాలుగా స్వీకరించాలి. ఏ సాహిత్య ప్రక్రియని ఆ సాహిత్య ప్రక్రియా పద్ధతిలో విశ్లేషణచేసి విమర్శచెయ్యాలి. అన్నిటిని ముడివేసి సమన్వయ పరచాలనుకోవడం పొరపాటు అవుతుంది. అలా చేసే విమర్శ సరియైనది కాకుండాపోతుంది. విశ్లేషణాత్మకమైన విమర్శే సాగాలి.

ఆధునిక తెలుగు సాహిత్యంలో కొత్తగా వచ్చిన ధోరణులను విశ్లేషించి స్పష్టతతో ప్రామాణికంగా సర్వోత్తమమైన రచనలను, సర్వోత్కృష్టమైన రచయితలను ఎంపిక చేసి వ్రాసిన మార్గదర్శకములైన విమర్శనా గ్రంథాలు రాలేదు.

—— చాగంటి తులసి

పాశ్చాత్య సాహిత్య ప్రక్రియ గురించి ఒక్కొక్క కవిమీద ఒక్కొక్క రచయిత మీద వివిధ దృక్పథాలతో వ్రాసిన విమర్శనా గ్రంథాలు అనేకం కనబడతాయి. అదే పధంగా హిందీలో ఒక్కొక్క సాహిత్య ప్రక్రియగురించి ఒక్కొక్క కవి మీద ఒక్కొక్క రచయితమీద వివిధ దృక్పథాలతో వ్రాసిన విమర్శనా గ్రంథాలు అనేకం వస్తున్నాయి. తెలుగులో సమకాలీన సాహిత్యంపైన ఆధునిక సాహిత్య ప్రక్రియలపైన సమగ్రమైన విమర్శనా గ్రంథాలు రాలేదు.

ఆధునిక సాహిత్య ప్రక్రియలకు, కవిత్వానికి, కథానికకి, నాటకానికి ఒరవడి పెట్టి బాటవేసినవాడు గురజాడ. దేశీయ ఛందస్సుల్లో దేశీయభాషలో కథా కావ్యాలు వర్డ్స్వర్త్, కాల్‌రిడ్జ్, లిరికల్ బాలడ్స్‌లా వ్రాసి కృతకృత్యుడవడమే కాకుండా గేయ కవిత్వానికి అభ్యుదయ కవిత్వానికి దారి చూపెట్టాడు. గురజాడ వ్యావహారిక భాషనుకావ్యభాషగా రూపొందించాడు. సామాన్యులభాష వాడ్డంలో వర్డ్స్వర్త్ కృతకృత్యుడు కాలేకపోయాడు. కాని గురజాడ కృతకృత్యుడయ్యాడు. వీటికి తోడు ఆరోజుల్లో మనదేశంలోని సంఘ సంస్కరణోద్యమానికి విశిష్ట ప్రయోజనం సాధించడంకోసం సాహిత్యాన్ని సాధనంగా చేస్తాడు. ప్రజలకోసం ప్రజలభాషలో సమాజ ఉన్నతికి సాహిత్య సృజన జరిపి సాంఘిక చైతన్యం కలగ చెయ్యాలన్న విశిష్ట ప్రయోజనాన్ని మహాకవి గురజాడ గుర్తించడమేకాక తన 37 సాహిత్యం ద్వారా దానిని సాధించి రాబోయే తరాల వారికి మార్గదర్శకుడయాడు. సమకాలీన తెలుగు జీవితం నుండి, జీవిత యదార్థం నుండి వస్తువుని స్వీకరించి సాహిత్యం జీవిత విమర్శ కావాలి, జీవితాన్ని బాగుచేసేది కావాలి అని రచనల ద్వారా నొక్కి వక్కాణించి చెప్పాడు. ఆయన పూర్ణమ్మ కన్యక మొదలైనకథా కావ్యాలయితే నేమి, దిద్దుబాటు, దేవుళ్లారా మీ రేమిటి అన్న కథానికలయితేనేమి, ఆయన నాటకం కన్యాశుల్కం అయితేనేమి ఆయన ఈ భావాలకు అద్దాలు. ఆయన కన్యాశుల్కం 1892లో మనదేశంలోనేకాదు బ్రిటిష్ సామ్రాజ్యంలోనే మొట్ట మొదటి సారిగా ప్రచురించబడి ప్రదర్శించబడిన వచన నాటకం. అప్పటికి బెర్నార్డ్‌షా రెండు నాటకాలను వ్రాసాడు. కాని అవి పుస్తకరూపంలో అచ్చుకాలేదు రంగస్థలంమీద ప్రయోగించడం కోసం తంటాలు పడుతూ ఉన్నాడు. విజయ నగరంలో కన్యాశుల్కం నాటకం రంగస్థలం మీద ఆడబడ్డాది అంటే గురజాడ ఎంత గొప్పవాడో అతని ప్రతిభ ఎంతటిదో తెలుస్తుంది.

గురజాడ రొమాంటిక్ పద్ధతికీ తర్వాత వచ్చిన రాయప్రోలు సుబ్బారావు గారి రొమాంటిక్ పద్ధతికీ బ్రహ్మాండమైన వ్యత్యాసం ఉంది. తర్వాత వచ్చినది

శృంగార పరమైనది. కృష్ణశాస్త్రి మొదలైన భావ కవులు శృంగార సంబంధమైన గీతాలు రాశారు. అమలిన ప్రేమ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ వీరు కవిత్వం చెప్పారు. గురజాడ దృక్పథానికి భిన్నమైన దృక్పథంతో సాంఘిక ప్రవృత్తి కన్నా వ్యక్తి ప్రవృత్తే అధికమనే ఆత్మాశ్రయ కవిత్వం వారిది. చుట్టూరా ఉన్న జీవిత వాస్తవాన్ని విస్మరించి స్వాప్నిక జగత్తులో వారు విహరించారు. ఈ దృక్పథాన్ని ఖండిస్తూ భావ కవిత్వం మీద ధ్వజం ఎత్తిన వారిలో శ్రీరంగం నారాయణ బాబు ప్రథముడు. వారి కవిత్వంలో నల్లమందు నిషా ఉంది. అది యదార్థ జీవితం నుండి పలాయనం చిత్రించిన కవిత్వం. ఆ కవులు దంత హర్మ్యాల కవులు అని అన్నాడు. నారాయణ బాబు గీతాల్లో ఈ అవహేళన కనబడుతుంది.

ఈ భావ కవులు కొంత వరకూ గురజాడకు అనుయాయులే. వీరు వచనం వ్యావహారికంలో వ్రాయాలి అన్నారు. కాని కవిత్వంలో వ్యావహారికాన్ని స్వీకరించలేదు. సమాస భూయిష్టమైన గ్రాంధిక భాషను విరివిగా వాడుకున్నారు. రాయప్రోలు, కృష్ణశాస్త్రి, వేదుల, అబ్బూరి గ్రాంధికంలోనే చాలాభాగం వ్రాసారు. దేశీయ ఛందస్సులను గురజాడ ప్రారంభిస్తే కొన్ని ఆ ఛందస్సుల్లో రాస్తూ 38
సాంప్రదాయికమైన వృత్తాల్లో కూడా కవిత్వం చెప్పారు. భాష దృష్టితో నేమి, జీవిత యదార్థాన్ని విస్మరించి కల్పనాలోకాన్ని ఆశ్రయించడంలో అయితే నేమి సాంఘిక ప్రవృత్తికన్నా వ్యక్తి ప్రవృత్తి అధిక మనడంలో నైతే నేమి, అన్నిటా గురజాడ దృక్పథానికి రొమాంటిక్ ప్రవృత్తికి భిన్నమైన దృక్పథంతో రొమాంటిక్ ప్రవృత్తితో వీరు కవిత్వం చెప్పారు. ఆ కారణం చేతే రాయప్రోలు సుబ్బారావు గారితో పునర్వికాసం చెందిన రొమాంటిక్ కవిత్వం అంతరించిపోయింది. గురజాడ అప్పారావు గారి పద్ధతి సాగుతూ ఉంది. ఆ పద్ధతే ముందుకు సాగుతుంది.

రొమాంటిక్ ప్రవృత్తిని మార్గదర్శకంగా చేసిన గురజాడ సాహిత్య స్వరూపాన్ని సరిగా నిర్ధారణ చేసి చెప్పవలసిన విమర్శనా గ్రంధాలు కొన్ని దశాబ్దాల క్రితమే రావల్సినది. శ్రీ కె.వి. రమణా రెడ్డి గారి మహోదయం బంగోరెగారి కన్యాశుల్కం విమర్శ మొన్న మొన్న వచ్చాయి. ఈ రెండు పుస్తకాల్లోని భావాలతో అందరూ ఏకీభవించకపోయినా వారుచేసిన ప్రయత్నం చాలా సరియైనది.

గురజాడ వేసిన బాటలో కవిత్వం, కథానిక నాటకం పయనించి వికాసం చెందుతున్నాయి. వచన రచనలు చేసిన గుడిపాటి వెంకటచలం, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, కరుణకుమార్, గోపీచంద్, కొడవటిగంటి, పాలగుమ్మిపద్మరాజు, బుచ్చిబాబు, చాగంటి సోమయాజులు గురజాడకి అనుయాయులే. వీరందరిలో కావలసినంత వైవిధ్యం ఎవరి వ్యక్తిత్వం వారికున్నా స్థూలంగా వీరిని గురజాడ అనుయాయులని చెప్పవచ్చు. కవిత్వంలో నారాయణబాబు, శ్రీ శ్రీ, బసవరాజు అప్పారావు, నండూరి మొదలైనవారు, నాటకరంగంలో విశ్వనాధ కవిరాజు, భమిడిపాటి కామేశ్వరరావు గురజాడ వారి పద్ధతిలో వ్రాశారు.

ఆ రోజుల్లో భావ కవిత్వంమీద భావ కవులు గాని భావ కవులను సమర్ధించే వారుగాని భావ కవిత్వాన్ని సమర్ధిస్తూ విమర్శనా గ్రంధాలు వ్రాయలేదు. వారివి వారు సమర్ధించుకున్న విమర్శనా గ్రంధమూ రాలేదు. వారిని ఖండిస్తూ వ్రాసిన విమర్శనా గ్రంథమూ రాలేదు. హిందీలో ఛాయావాదీ కవిత్వం మీద ప్రముఖులైన కవులు నలుగురూ, జయశంకర్ ప్రసాద్, సుమిత్రానందన్‌పంత్, సూర్యకాంత త్రిపాఠీనిరాలా, మహాదేవివర్మ—తమ దృక్పధాన్ని చెపుతూ విమర్శనలు 39 వ్రాసారు; ఛాయావాదీ ప్రవృత్తులమీదా, ఛాయావాదీ కవులు ఒక్కొక్కరి మీద వేరు వేరుగా విమర్శనా గ్రంధాలు వచ్చాయి. తెలుగులో కృష్ణశాస్త్రి మొదలైన భావ కవులమీద వేరు వేరుగా విమర్శనా గ్రంధాలు వెలువడలేదు. చలం, శ్రీపాద, కరుణకుమార్ మొదలైన రచయితలమీద వేరు వేరుగా వారి రచనలను విశ్లేషిస్తూ విమర్శనా గ్రంధాలు ఆ రోజుల్లోనే వ్రాయవలసినది. కాని ఈ రోజుకు కూడా అలాంటి విమర్శనా గ్రంధాలు రాలేదు. నారాయణబాబు, శ్రీ శ్రీ మొదలైనవారి మీద వేరు వేరుగా సరియైన పరీక్షచేసి నిర్ధారణ చేసి చెప్పే విమర్శనా గ్రంధాలూ రాలేదు. ఇలావుంది మన విమర్శనా ప్రక్రియ.

---


## "అభ్యుదయం"

పైకం తప్ప తక్కినవాటన్నింటికి చిరునామా :

Yetukuri Prasad,
3-6-737/3,
Himayatnagar,
Hyderabad-500 029.

పైకం (చెక్కులు. డ్రాఫ్టులు, మనిఆర్డర్లు) వాటికి చిరునామా :

Y Vijaya Kumar
3-5-911/B1, Himayatnagar,
Hyderabad-500 029.

# అసలు రహస్యం

రాజమూర్తిని నేను చిన్నప్పట్నించీ ఎరుగుదును. అతను మితభాషి. ఒకే వీధిలో వుంటున్నా ఎప్పుడోగాని మేం కల్సుకోం.

సాయంత్రం 5 గం. లకు ఆఫీసు నుండి వచ్చినవాడు మళ్ళీ ఉదయం 10 వరకూ ఇంటిపట్టునే ఉంటాడు. అతని కేరకమైన దురభ్యాసాలూ లేవు అటువంటిది మా ఆవిడ చెబితే నమ్మలేదు గాని రెండ్రోజులనుంచి చూస్తుంటే నాకే ఆశ్చర్యంగావుంది.

"ఏం కూరలో వాటికోసం మార్కెట్టుకు పోవడమెందుకో యింటికొచ్చి అమ్మేవారి దగ్గరకొంటే పోలా ?" అనే రాజమూర్తి యిప్పుడు పొద్దున్నే కూరలకు బయల్దేరి 9 గం.లకు తిరిగొస్తున్నాడు. సాయంత్రం ఆఫీసునుండి వచ్చి షికారెళ్ళినవాడు రాత్రి 9 గం.ల వరకూ యింటిముఖం పట్టటంలేదు–

ఈ మార్పు విషయమై అతన్నే అడగాలని ఓరోజు గుమ్మంలో నిల్చుని అతన్ని కలసి అసలు విషయాన్ని కదలేశాను.

"ఈ మధ్యేమిటీ టైం టేబిలు మారిపోయిందీ" అని– రాజమూర్తి అర్థంకానట్లు చూశాడు. 'అదే—ఈ షెడ్యూలు అవీ నీకు మునుపులేవుగా' అన్నాను 'ఆదా' అంటూ నవ్వి వూరుకున్నాడు. అతని తత్వమే అంత ఒకంతట బైటపడడు 'మీ శ్రీమతితో తగువుగాని వేసుకున్నావేటి' అన్నాను మళ్ళీ–

'లేదు' అన్నాడు ముక్తసరిగా.

'మరి? కాల్చుకుతినే చుట్టాలొచ్చారా'

'మా యింటికి కాదు. పక్కింటికొచ్చారు' అన్నాడు తాపీగా

'ఆడా? మగా?'

40

'అందమైన ఆడపిల్లే' అన్నాడు నవ్వుతూ'

'మరేం? మీ ఆవిడ కనుమానమా?' అన్నాను చనువుగా.

'అబ్బే. అలాంటిదేం కాదు.'

"మరి?"

"వాళ్ళు రహస్యంగా మాట్లాడుకుంటేనే చెవుల్లో మైకుపెట్టి అరచినట్టుంటుంది– ఈ వారంరోజుల్లోనూ వాళ్ళు రహసాలెప్పుడూ మాట్లాడుకోలేదు''

అసలు కారణాన్ని వివరించాడు రాజమూర్తి. నాకు నవ్వాగలేదు.

—ఆదూరి వెంకట సీతారామమూర్తి.

# నేనం

పవనాన్నై తాకుతాను
ప్రళయాన్నై రేగుతాను
ప్రేమ మాధురినై చేరతాను.
పరాశక్తినై ఛందాడతాను.
విముక్తికై పెనుగులాడతాను.

—సత్యవతీ దేవి

కొత్త శీర్షిక

[సాహితీ రంగంలోని వివిధ సమస్యలకు, అనుమానాలకు సమాధానాలు చెప్పుకోవడం కోసం 'సాహిత్య మీమాంస' అనే కొత్త శీర్షికను ప్రవేశ పెడుతున్నాం. ఈ సమస్యలకు సాహిత్య రంగంలోని వివిధ శాఖల్లో కృషి చేసిన ప్రముఖులు సమాధానాలు ఇస్తారు. ప్రశ్నలు పంపడం మీవంతు.

రచయితకు ఒక ప్రపంచ దృక్పథం ఉండవలసిన అవసరం ఉన్నదా ఉంటే ఏ దృక్పధాన్ని అనుసరించాలి అన్న ప్రశ్నకు శ్రీరాంభట్ల కృష్ణమూర్తి ఇచ్చిన సమాధానంతో ఈ శీర్షిక ప్రారంభిస్తున్నాం.]

# సాహిత్య మీమాంస

రచయితకు సామాజిక స్పృహ ఉండాలని కొందరు కాదు కమిట్ మెంట్ ఉండాలని మరి కొందరు ఈ మధ్య అంటున్నారు. కమిట్ మెంట్ ఒక్కటే చాలదు ఇన్ వాల్వ్ మెంట్ కూడా ఉండాలని ఇంకా కొందరు అంటున్నారు. అదీ ఇదీ కాదు పార్టిజాన్ అయినవాడే అభ్యుదయ రచయిత అని ఇంకా కొంత మంది అంటున్నారు.

సోషల్ అవేర్‌నెస్ అనే ఇంగ్లీషు మాటకు అనువాదం సామాజికస్పృహ. సోషల్ అవేర్‌నెస్, కమిట్ మెంట్ ఇన్‌వాల్వ్‌మెంట్, పార్టిజాన్‌షిప్ ఇవేమిటి? ఇందులో పార్టిజాన్‌షిప్ అనేది మార్క్సిస్టు లెనినిస్టు అభి వర్గం. అంటే కాటగిరి. దీన్ని తర్వాత చర్చిద్దాం.

సోషల్ అవేర్‌నెస్, కమిట్ మెంట్ ఇన్‌వాల్వ్‌మెంట్ అనేవి తెలిసో తెలియకో మార్క్సిజంతో విభేదించే అతివాద తత్వాల అభివర్గాలు. ఇందులో మొదట సామాజిక స్పృహను పరిశీలిద్దాం.

సామాజిక స్పృహ అంటే శంకరాద్వైత వేదాంతులు చెప్పినట్లు జగన్మిధ్య అనుకోకుండా తానే కాకుండా తన చుట్టూ ఒక సమాజం ఉంది. తానూ, ఈ సమాజం కూడా వాస్తవం అన్న గుర్తింపు దగ్గర్నుంచి సమాజం పరిణామ శీలం, ఈ సమాజం ఇంతకన్నా సుఖమయమూ ఆనందదాయకమూ అయిన స్థాయిని అందుకోవాలి అన్నంత వరకు మధ్యనున్న అనేకానేక అంతరువుల జ్ఞానాన్ని సామాజిక స్పృహ అని పిలుస్తున్నారు. ఇందులో రచయితకున్న సామాజిక విజ్ఞాన స్థాయిని బట్టి నిర్వచనం స్థాయి ఆధారపడి ఉంటుంది.

నిజానికి వేదాంతాలేం చెప్పినా సమాజ వాస్తవ జ్ఞానం శంకరాద్వైతుల గురువులకుకూడా ఉంది. నాలుగు పీఠాల అధిపతులు ఈ మధ్య శృంగేరిలో సమావేశమై గోహత్యా నిరోధాన్ని గురించి, ఇతర రాజకీయ సమస్యల గురించి కూలంకషంగా చర్చించిన ఉదంతమే ఇందుకు తార్కాణం.

అలాగే సమాజం వర్గాలుగా విడివడి ఉందని నమ్మి బహుశ వర్గీయులు లేక వారి ప్రతినిధులమనుకుంటున్న వారు యథార్థంగా ఒకరినో అంతకుమించిన వారినో వర్గ శత్రువులను నిర్మూలిస్తే తప్ప సమాజం ముందుకు సాగదనుకునే వారిలో కూడా ఈ సామాజిక స్పృహ వ్యక్తం అవుతుంది. అందుకని సామాజిక స్పృహతో రచనలు చేస్తున్నామనే వారిలో జగద్గురు శంకర అనుయాయుల దగ్గర్నుంచి విప్లవ జగద్గురు అనుయాయులవరకు అందరూ ఉండవచ్చు. కనక సామాజిక స్పృహతో రచనలు చేస్తున్నామనుకునే వారి చూపు ఎటో, రూపు ఏమో ఇదమిత్థంగా తేల్చి చెప్పడం వారిని ఒక వర్గంగా విభజించడం సాధ్యంకాని పని.

ఇక రెండవ రకం కమిట్‌మెంట్ ఇన్‌వాల్వ్‌మెంట్ జాతి. కమిట్‌మెంట్‌కి నిబద్ధత అని తెలుగు అనువాదం చేశారు. నిబద్ధత దేనికి అంటే దీనికి కూడా పై నిర్వచనమే ఇవ్వవచ్చును. కాని భౌతిక వాద దృక్పథంతో సామాజిక విప్లవం కావాలని కోరేవారు మాత్రమే ఈ మాటను ఎక్కువగా వాడుతుండడం వల్ల "నిబద్ధత" అంటే సామాజిక విప్లవానికి నిబద్ధులై ఉండాలి అనే వారి సంకల్పం మాత్రమేనని మనం అర్థం చెప్పుకోవచ్చు. ఇన్‌వాల్వ్‌మెంట్ అనే మరో మాట ఉంది. దీన్ని నిమగ్నత అని అనువదించారు విప్లవ శక్తుల కార్యకలాపాలలో కలిసి పని చేయడాన్ని వీరు నిమగ్నత అంటున్నారు. అంటే రచయిత సమాజ పరిణామాలకు సాక్షీభూతుడుగా ఉండి వాటికి సాహిత్య రూపం కల్పించడం మాత్రమే కాక ఆ పరిణామాల్లో తాను కూడా యథాశక్తి పాల్గొనాలి అనేది ఈ నిబద్ధత, నిమగ్నతవల్ల తెలుస్తుంది ఒకే క్రియకు రెండు పదాలను ప్రయోగించడంవల్ల వీరి దృక్పథంలో ద్వైతం ఉన్నట్టు రుజువు అవుతుంది: ఈ విషయాన్ని తాత్వికంగా విశ్లేషిస్తే ద్వైతం భావవాదంలో ఒక కోవకు చెందినది. భావవాదంలో కూడా పరిపుష్టమైనది అద్వైతం.

ఈ నిబద్ధత, నిమగ్నతా వాదులు తమతత్వం భౌతిక వాదమంటారు. ఆదిమ భౌతికవాదం అయిన సాంఖ్యంలో ద్వైత ఛాయలున్నాయేమో కాని అది పూర్తిగా ద్వైతంకాదు. భౌతిక వాదం అద్వైతమతం. అందుకని ద్వైతానికి 42 పొత్తు కుదరదు. నిబద్ధత, నిమగ్నతా వాదుల తాత్విక అవ్యవస్థ వారిరచనలో కూడా వ్యక్తం అవుతుంది.

మరొక మాట పార్టిజాన్‌షిప్. దీనికి పక్షపాతం అని అనువాదం చేయవచ్చు. పార్టిజాన్‌షిప్‌లో నిబద్ధత ఉంది నిమగ్నత ఉంది-ఎందుకంటే మార్క్సిస్టు లెనినిస్టు మతం ప్రకారం రచనా లేక కళా సృజన అన్నది. ఉదాత్తమైన శ్రమ. రచనను ఉత్తమమైన శ్రమగా భావించినప్పుడు శ్రామిక జన పక్షపాతం దాని సహజవృత్తి. ఈ పక్షపాతం అనేది ఆలోచనలో, అవగాహనలో, నిత్య నైమిత్తిక కార్యకలాపాలలో, ఆందోళనలో, పోరాటాల్లో సర్వత్ర యథాశక్తిగా వ్యక్తం అవుతూనే ఉంటుంది: అయితే మార్క్సిస్టు లెనినిస్టు ప్రపంచ

దృక్పథం స్థాయిని బట్టి దీని వ్యక్తీకరణ ఆధారపడి ఉంటుంది.

ఇప్పుడు నిబద్ధత, నిమగ్నత, పార్టిజాన్‌షిప్ లను వ్యక్తీకరించే విభిన్న వాదాలను పరిశీలిద్దాం. నిబద్ధత, నిమగ్నత వాదులు మూడురకాలు. విప్లవ శక్తుల కార్యకలాపాలను కళల్లో చిత్రించడమే రచయిత పని. అంతకు మించి ఆ శక్తుల కార్యకలాపాలతో ప్రత్యక్ష సంబంధం ఉండరాదనే వారు కేవలం నిబద్ధత వాదులు. ఆ పోరాటాల్లో తాముకూడా ప్రత్యక్షంగా పాల్గొంటే రచనా వ్యాసంగం సాధ్యం కాదని వీరి వాదన. పోరాటాల్లో పాల్గొంటూనే ఆ అనుభవాల ద్వారా రచనను పరిపుష్టం చెయ్యవచ్చును అంటారు నిమగ్నతా వాదులు.

క్రిస్టఫర్ కాడ్వెల్, లూయీ అరగాన్ దగ్గర్నుంచి సుబ్బారావు పాణిగ్రాహి దాకా అందుకు ఉదాహరణగా వారు పేర్కొంటారు. వీలైనప్పుడు నిమగ్నత, కానప్పుడు కనీసం నిబద్ధత, రెండూ ఉండడం మంచిదని మరోరకం వాదన. ఇప్పుడు ప్రముఖ రచయితలుగా ఉన్నవారు వీలునుబట్టి ఈ కోవకు చెందుతారు.

పార్టిజాన్‌షిప్ వాదులకు ఒక నిర్దిష్ట వైఖరి ఉంది. జానపద కథల్లో కుక్క చేయవలసిన పని గాడిద చేస్తే ఏమైందో అందరికీ తెలుసు.

సమాజ సంఘర్షణ ముఖ్యంగా మూడు రూపాల్లో ఉంటుంది ఆర్థిక వర్గ సంఘర్షణ. రాజకీయవర్గ సంఘర్షణ, భావ వర్గ సంఘర్షణ. ఈ మూడు ఏక కాలంలో జరిగినప్పటికీ సంఘృష్ట సైనిక నివహాలు మాత్రం వేర్వేరుగా ఉంటాయి. ఆధునిక యుద్ధంలో సైన్యం అంతా పాల్గొంటున్నప్పటికీ దానిలో జనరల్స్, సాపర్స్, అర్టిలరీ, మెడికల్ కోర్స్ లాంటి అనేక విభాగాలున్నట్టుగానే ఈ త్రివిధవర్గ సంఘర్షణల్లో నిర్దిష్టమైనసేనా నివహాలుంటాయి.

ఆర్థిక వర్గ సంఘర్షణలో ప్రధాన పాత్ర వహించేవారు కార్మికులు, శ్రమజీవులు. రాజకీయ వర్గ సంఘర్షణలో ముఖ్యపాత్ర కార్మిక వర్గ అగ్రదళానిది. భావ సంఘర్షణలో ముఖ్యమైన నుండేది రచయితలు, కవులు, కళాకారులు, 43 మేధావులు. అందుకని రచయిత పార్టిజాన్‌షిప్‌కు ఒక నిర్దిష్టమైన స్థానముంది. ఆ రంగాన్ని విడిచి మరో రంగంలో ప్రముఖ పాత్ర వహించదలచుకున్నప్పుడు ఆ రంగ సైనికుడే అవుతాడు కాని భావరంగ సైనికుడుగా మిగలడు. ఒకే వ్యక్తి ఏకకాలంలో సకల రంగాల్లోను విశ్వరూపమెత్తి పోరాడడం భగవద్గీతా భావ వాద తత్వంలో సాధ్యమేమోకాని వాస్తవ వాదులకు సాధ్యం కాదు.

అందుకని పార్టిజాన్‌షిప్‌ను విశ్వసించేవారు తమ యుద్ధరంగమేదో అందులో తమ పాత్ర, స్థానం ఏమిటో విస్పష్టమైన అవగాహనతో ఉంటారు. అప్పుడే వారిని పార్టిజాన్‌లు అనడం సాధ్యం.

అయితే ఆర్థిక వర్గ సమరం జాతీయ సరిహద్దును తాకినప్పుడు అది రాజకీయ

వర్గ సమరంగా రూపొందు తుందని మార్క్సిస్టు మహోపదేష్టలు అన్నారు. అలాగే రాజకీయవర్గ సమరం కూడా విశ్వవ్యాప్తం అయినప్పుడు అది భావ వర్గ సంఘర్షణగా రూపొందుతుంది. ఆ దశలో భావ వర్గ సాంగ్రామికులు ప్రత్యక్ష సైనికులుగా మారుతారు ఆ మార్పు వచ్చేదాకా వారు నిర్దిష్ట రంగం లోనే పోరాడుతూ ఉంటారు. ఇది పార్టిజాన్‌వాదుల దృక్పథం. అభ్యుదయ రచయిత తాను పార్టిజాన్‌ని, కార్మిక వర్గ పక్షపాతిని అని చెప్పుకోవడంలో ఉద్దేశం ఇది.

— ౦ —

# ఉపదేశం

కళ్ళముందు సినీమారీళ్ళలా
గిరగిరా తిరుగుతున్న
నవాబూ-బాంచల రోజువారీ యవ్వారాల్ని చూసి
కలతచెందకు.

రివాజుగా పెరిగిపోతున్న
ధరవరల గలేజీ ఆకారాన్ని
జీరాఫీగ్రాఫులో చూస్తూ
కలవరపడకు.

బ్రతకడానికి తలయెత్తిన అరిటాకు బావుటా
సున్నిత హృదయాన్ని విప్పితే
ఆకలితో తాకుతున్న ముళ్ళబాకుల్ని గమనించి
బేజారెత్తి కేకలు వెయ్యకు.

కరుడు గట్టిన
కఠోర కరోడా పెట్టుబడిదారీ పెగోడా
పిల్లల్ని తెగ కంటున్నదని
గాభరాపడకు.



ఆనందించి చప్పట్లు కొట్టు!
"అభివృద్ధి సాధిస్తున్నాం" అని దబాయించు!
వేదాంతాన్ని అడ్డుపెట్టుకొని
చిద్విలాసం ఉట్టిపడేలా మౌనంగానవ్వు!
శిశు సంక్షేమాన్ని ప్రబోధించే
సంగీతాన్ని పాడుతూ, తానం జిడ్డుగా లాగు!

ఇలాగైతే....ఇలాగైతేనే...
ఇవాళ సమాజం నీకు దండలేస్తుంది
సాగిలపడి 'దండాలు సామీ!' అంటుంది-
రేపటి సంగతి మాత్రం నన్నడగవద్దు.

—ఇజ్జాడ వెంకట్రావు.

# "అసహాయం" —— సోమర్‌సెట్ మామ్

అతని మొహం మీదవున్న మచ్చ వల్ల అతన్ని మరోసారి చూసాను. నుదుటి మీదనుంచి గడ్డందాకా పొడుగ్గా వున్న ఆ మచ్చ, అందంగా ఉండే అతని మొహానికి వికారాన్ని కల్గిస్తోంది.

ఆ మచ్చ కత్తివల్ల కలిగిందో, మోర్టార్ షెల్ తగిలి కలిగిందో తెలియదునాకు. బలంగా ఎత్తుగా కొద్దిగా హుందాగావున్నాడు అతను. బట్టలు కూడా శుభ్రంగా లేవు.

గౌతమేల నగరంలో పేలస్‌హోటల్‌కి రోజూ సాయంత్రం వచ్చి లాటరీ టికెట్లు అమ్ముతుండేవాడు. అతని దగ్గర ఎవరూ టిక్కెట్లు కొనగా చూడలేదు. అయితే అప్పుడప్పుడు ఎవరయినా తాగడానికి మద్యం ఇస్తూండేవారు. వద్దనే వాడు కాదు. నా అనుమానం అతనసలు ఆ విధంగా వూరికే దొరికే మద్యం కోసమే వస్తాడు.

ఓ రోజు సాయంత్రం నేనో స్నేహితుడితో మాట్లాడుతూంటే మొహాన మచ్చగల ఆ వ్యక్తి మా దగ్గరికి వచ్చాడు. పేలస్ హోటల్‌లో అతన్ని చూసినేను ఇరవైయవసారి తలఅడ్డంగా వూపాను లాటరీ టిక్కెట్లు అక్కరలేదన్నట్లుగా.

నా స్నేహితుడు ఓ టికెట్ కొని అతన్ని అడిగాడు.

"ఎలావుంది జీవితం?"

"ఫరవాలేదు. వ్యాపారమే బావుండటంలేదు" చెప్పాడు.

"ఏంతీసుకుంటావు?"

"బ్రాందీ."

బ్రాందీ తాగి ఇంకో టేబిల్‌దగ్గరకి వెళ్ళిపోయాడు అతను.

"ఎవరు నీ స్నేహితుడు? అతని మొహం మీదమచ్చ భయంకరంగా వుంది." అన్నాను. 45

"దాంతో అతని అందం పోయింది కదా! అతను నికరాగునుంచి వెళ్ళగొట్టబడ్డాడు ఆ దేశప్రభుత్వం చేత. వాడు దోపిడీదొంగ, రౌడీ కానీ చెడ్డవాడు కాడు. నికరాగు ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి పనిచేసిన ప్రజాసైన్యంలో జనరల్, సమయానికి మందుగుండు సామాగ్రి అయిపోకపోతే ప్రభుత్వాన్ని కూలద్రోసి ఈపాటికి ఆ దేశానికి మంత్రి అయివుండేవాడు, గౌతమేలాలో లాటరీ టిక్కెట్లు అమ్మేబదులు, అతన్ని, అతనిస్నేహితులని పట్టుకున్నారు. మొత్తం అయిదుగురు. రాత్రంతా ఖైదులో ఉంచారు.

మర్నాడు వుదయం జైల్లోని ఓ విశాలమయిన ఆవరణలోవున్న గోడ దగ్గరికి తీసుకెళ్ళారు. అయిదుగురిని

—అను : పృధ్వీరాజ్

కాల్చిచంపవలసిందిగా ఆజ్ఞఇవ్వబడింది. ఆ ఆజ్ఞఇచ్చిన అధికారి స్వయంగా అది అమలు పరచడం చూడటానికి జైలుకి వచ్చాడు.

కాల్చడానికి ముందు జరగాల్సిన కార్యక్రమాలన్నీ పూర్తయ్యాయి.

ఆ అధికారి వాళ్ళని అడిగాడు మరణించబోయే ముందు ఏదయినా కోరిక కోరుతారా అని. నలుగురూ తలలు అడ్డంగా తిప్పారు. ఏంలేదన్నట్లుగా.

కాని ఇతను మాత్రం చెప్పాడు. "కడసారిగా నా భార్య దగ్గర వీడ్కోలు తీసుకోవాలి."

"నాకభ్యంతరం లేదు. ఎక్కడుంది?" అడిగాడు అధికారి.

"జైలు బయట తలుపు దగ్గరుంది." "ఇంకా మంచిది. అయిదు నిమిషాల్లో ఇక్కడ పనిపూర్తి చేసేయచ్చు. ఆలస్యం కాదు." అని ఆ అధికారి సౌంజ్ఞ చేసాడు సైనికులకి.

వాళ్ళు బయటకి వెళ్ళి కొద్దినిమిషాల్లో నల్లని ముసుగులో వున్న అతని భార్యని తీసుకు వచ్చారు.

పెద్దగా అరిచి ఆమె అతని దగ్గరకి వచ్చింది. నల్లని తెర మొహంమీదకూడా వుంది అయినా అస్పష్టంగా కనిపిస్తోంది ఆమె మొహం. ఎంతో అందంగా అమాయకంగా వుంది. బుగ్గల మీద కన్నీళ్లు జారుతున్నాయి.

అతను రెండడుగులు ముందుకువేసి తన భార్యని తన చేతులోకి తీసుకున్నాడు. ఆమె మొహంమీదవున్న ముసుగును నెమ్మదిగా తొలగించాడు గాఢంగా ఆమె పెదవులని చుంబించాడు. ఆమె అందానికి క్షణకాలం సైనికులు తమని తాము మరచి ఆమె వంక చూస్తూండిపోయారు.

హఠాత్తుగా అతను తన చొక్కాలోంచి ఓ కత్తిని-ఆ కత్తి ఎలా ఎక్కడనుంచి సంపాదించాడో తెలియదు ఈ రోజు దాకా-తీసి ఆమె మెడ వెనక పొడిచాడు. గాయంలోంచి రక్తం కారి అతని చేతులు తడిసి పోయాయి ఆ రక్తంలో. కత్తి పారేసి మరోసారి ఆమె పెదవులని ముద్దు పెట్టుకున్నాడు.

ఇదంతా ఎంత త్వరగా జరిగిందంటే చాలా మందికి అసలేం జరిగిందో అర్థం కాలేదు. చూసినవాళ్ళు భయంగా అరిచారు. ఆమెని అతని చేతుల్లోంచి విడిపించి కింద పడుకోపెట్టారు. అతన్ని రెక్కలు విరిచి పట్టుకున్నారు కదలకుండా. 46

ఆమె అప్పటికే మరణించింది. అతనికి తెలుసు వెంటనే చంపాలంటే ఎలా ఎక్కడపొడవాలో.

వాళ్ళ మరణం చూడడానికి వచ్చిన అధికారి, సైనికులు నిర్ఘాంతపోయి చూస్తూండిపోయారు.

'నేను సిద్ధం" అన్నాడు అతను'

'ఎందుకు చంపావు ఆమెని?' అడిగాడు ఆ అధికారి కోపంగా.

'నే ప్రేమించాను'.... నా తర్వాత మరెవరూ ఆమెను అనుభవించకూడదు" చెప్పాడు అతను స్థిరంగా.

ఆ అధికారి నిశ్శబ్దంగా చూసాడు అతని వంక కొన్ని క్షణాలు.

"అ దరూ చేయలేని గొప్పపనిఇది" అన్నాడు.

ఎవరూ మాట్లాడ లేదు.

"నేనితన్ని చంపించలేను. నా కారుతీసుకుని ఇతన్ని సరిహద్దు అవతల వదిలిరండి ఎప్పుడయినా ఈ దేశంవస్తే మాత్రంచావుతప్పదు."

సైనికులు అతన్ని బయటకి తీసుకు వచ్చారు. కారులో ఎక్కించుకొని తీసు కెళ్ళి సరిహద్దు అవతల వదిలారు".

నా స్నేహితుడు చెప్పటం ఆపాడు. నేను కొద్దిసేపు మాట్లాడలేకపోయాను. నిశ్శబ్దంగా ఉండిపోయాను.

"మరి ఆమచ్చ ఎలావచ్చింది? అడిగాను చివరికి.

"ఓ అదా? సోడాసీసా తెరుస్తుంటే అదిపగిలి గాయమయింది"– చెప్పాడు.

—ooo—

# షవర్ బాత్

కాంతి ముఖం మీద చెదిరిన నీలి
మబ్బుల్లా —
తీర్చిదిద్దిన నిబిడ కబరీ భరంలో
తీగెమెరుపుల పూలహారాలు చుట్టి
పసిడి కాంతుల పాపిట
'పాలపుంత ముత్యాల పాపిటిసేరు'
వ్రేలాడవేసి
విశాల ఫాలాన నిండుజాబిల్లిని బొట్టుగా
తీర్చి
రొంటిలో సంధ్యారాగం జరీ అంచుపైట
దోపి
నా పున్నమ్మ వెన్నెల్లా నవ్వుతుంటే
అనిర్వచనానుభూతి సన్నిట షవర్ బాత్

అందుకే—
ఆశల వసంతాల పచ్చని కాశ్మీరశాలువా
కప్పుకుని
ప్రశాంతపు హరి విల్లును
కిరీటంగా చుట్టుకొని
ప్రభాత భవన సోపానాల
అధిరోహించ నేర్చిన భావుకుణ్ణి
క్రాంతికాంతా కాంతుణ్ణి
ప్రతీప పైశాచీ హంతకుణ్ణి

తామరతంపరల్లా మొలిచిన
చీకూ చింతల భ్రాంతుల
చిక్కని కలుషులు పెరికేవాణ్ణి
చక్కని లోకకల్యాణం పండించే
శ్రమైక జీవన పక్షపాతిని
ప్రేమైక జీవిని—

అక్షరకోరకాల సుమింపజేస్తాను
అక్షయ సుమాల్ని
మధుర భావనా కోశపు రమణీయ మండ
లంలో
హృదయాహ్లాదపు సాంద్ర చాంద్రీ
ఝురుల
ప్రవహింప జేస్తాను.

"ప్రత్యూష"

# జి. డి. ఆర్. లో ప్రేంచంద్

రెండేళ్ళ క్రితం జులై 1977 లో జరిగిన విషయం జ్ఞాపకం వస్తున్నది. బెర్లిన్ అలెగ్జాండర్ ప్లాట్జ్ రైల్వే ప్లాట్ ఫారం మీద తీరికగా నడుస్తూంటే, పత్రికల దుకాణంలో ప్రదర్శించిన పుస్తకమొకటి నన్నాకర్షించింది. దగ్గరకు వెళ్ళిచూస్తే, 'నిర్మల'-ప్రేంచంద్ వ్రాసిన నవల. జర్మన్ భాషలో తర్జుమా.

దుకాణంలోని ముసలమ్మను అడిగాను "ఏమమ్మా, యీ పుస్తకం ఎలా ఉంటుంది?" "బాగానే ఉండిఉండాలి, చాలా మంది కొన్నారు." ఇంతలోనే నేను వెళ్ళాల్సిన ఎలెక్ట్రిక్ ట్రెయిన్ వచ్చింది. సంభాషణ ఆపేసాను.

తర్వాత, పలువురు జి. డి. ఆర్. మిత్రులను ఆ నవల గురించి ప్రశ్నించాను. వారూ అదే విధంగా చెప్పారు. ఆ నవల చాలా మందికి నచ్చిందని. రచయిత ప్రేంచంద్ పేరు కూడా పలువురికి పరిచయిమేనని అర్థమయ్యింది కూడా.

ప్రేంచంద్ రచనలు జి. డి. ఆర్. ప్రజలకు మొదటి సారిగా (1959 లో "A Hand ful of wheat" అనే కథల సంపుటి తర్జుమా ద్వారా పరిచయమయ్యాయి.

ఆ దేశంలోని సాహితీ వేత్తలకు ప్రేంచంద్ గురించి గల అభిప్రాయమేమిటి? 1972 లో లైప్జిగ్ పట్టణంలో విదేశీ రచయితల గురించి ప్రచురించిన ఎన్ సైక్లో పీడియాలో సమాధానం లభిస్తుంది. దాదాపు 100 దేశాల రచయితలను, 1600 పైగా వ్యాసాల ద్వారా మార్క్సిస్టు దృక్పథం నుంచి పరిచయం చేస్తుంది యీ పుస్తకం.

ప్రేంచంద్ గురించి యీ క్రింది విధంగా వ్రాసారు.

"ప్రేంచంద్-అసలు పేరు ధనపత్ రాయ్. 31. 7. 1880లో వారణాసి సమీపంలో లమహీలో జననం, 8.10. 1936 న వారణాసిలో మరణం; ప్రముఖ భారత రచయిత: చిన్న రైతు కుటుంబంలో జన్మించాడు; బడి పంతులుగా, స్కూళ్ళ యిన్స్పెక్టర్‌గా, సంపాదకుడుగా పని చేశారు.



మొదట్లో ఉర్దూలో రచనలు సాగించాడు. తర్వాత హిందీలో; భారతదేశపు అభ్యుదయ రచయితల సంఘం స్థాపకుడు, మొదటి అధ్యక్షుడు; అంతలోనే తన రచనా శక్తిని జాతీయోద్యమాని అంకితం గావించాడు; టాగూర్, టాల్‌స్టాయ్, చెకోవ్, గోర్కీల వలన ప్రభావితుడై నాడు. హిందీ సాహిత్యంలో ప్రప్రథమ "క్రిటికల్ రియలిస్ట్" గా పరిణతి చెందాడు. "ప్రోగెసివ్ రొమేంటిసిజంకు కూడా యీయన దగ్గరవాడే.

"జి. కె."

ఆయన సృజనాత్మక రచనలలో అత్యంత ముఖ్యమైనవి గ్రామాల గురించి కథలు, నవలలు.

ఉర్దూలోని మొదటి కథల సంపుటి "సోజెవతన్" (1908, "మాతృభూమి కష్టాలు")ని నాటి ఆంగ్ల పాలకులు బహిరంగంగా తగలబెట్టారు; ఆయన నవలా రచనలలో ప్రతీక "గోదాన్" (1936) భగ్నమౌతున్న గ్రామీణ వ్యవస్థ, అప్పుడప్పుడే అవతరిస్తున్న కార్మిక వర్గం ఈ రచనలో ప్రత్యక్షమౌతాయి. స్త్రీలసమస్యలను చిత్రించడానికి ప్రేంచంద్ ఎంతో కృషి చేశాడు. ఉదా.–ఆయన నవలలు "ప్రేమ" (1904), "నిర్మల" (1923). అదేవిధంగా జాతీయ పోరాటాన్ని చిత్రించడానికి కూడా ఆయన ఎంతో కృషి చేశాడు ఉదా : ఆయన నవలలు 'రంగభూమి' (1923) "గబన్" (1930) "కర్మభూమి" (1932). "జైనేంద్ర కుమార్" వంటి సమకాలిక రచయితలపై ప్రేంచంద్ ప్రభావం పడింది.

ఆయన యితర రచనలు:– 'వర్దాన్' (నవల, 1906), "సేవాసదన్"(నవల) "ప్రేమాశ్రమ్" (నవల 1922) "ప్రేంపచీసీ" (25 కథలు, 1923) "ప్రేంప్రతిమ" (1926 43) (కథలు) "ప్రేంద్వాదశి" (12 కథలు, 1926), "కాయకల్ప" (1928 నవల) "పంచ్‌ఫూల్" (1929 కథలు) "సప్త సుమన్" (1930 కథలు), "ప్రేం పంచమి" (కథలు, 1930), "మాన్ సరోవర్" (కథలు, 1936), "కఫన్" (కథలు, 1937), "నారీ జీవన్‌కీ కహానియా" (కథలు, 1938), "కుచ్ విచార్" (వ్యాసాలు, 1939).

ఇవి ఆ పుస్తకంలో యిచ్చిన సంక్షిప్త సమాచారం. సోషలిస్టు జి. డి. ఆర్. స్వతంత్ర భారత్‌ల మధ్య 1972 అక్టోబరు లో సంపూర్ణ దౌత్య సంబంధాలు ఏర్పడ్డాయి. నాటినుంచి సాంస్కృతిక, సాహిత్య సంబంధాలు పరస్పరం అవగాహనతో అభివృద్ధి చెందడానికి అవకాశాలు హెచ్చయ్యాయి. "శకుంతల", "ముద్రారాక్షసం" "వసంతసేన" మొ॥ ప్రాచీన కళాఖండాలేగాక, 20వ శతాబ్దపు రచయితలను గురించి, వారి రచనల గురించి ఆదేశంలో ఆసక్తి నానాటికి అధికమవుతున్నది. ప్రపంచ శాంతి 49 ఉద్యమం యిచ్చిన పిలుపును అవకాశంగా తీసుకొని 1980 లో ప్రేంచంద్ శత జయంతి"ని జరపడానికి అక్కడి వివిధ సంఘాలు అనుకుంటున్నాయి. అక్కడ ఏర్పడిన జి. డి. ఆర్. భారత మిత్రమండలి వేదికపై వచ్చే జనవరిలో భారత రిపబ్లిక్ 30 వ వార్షికోత్సవం జరపడానికికూడా కృషి జరుగుతున్నది.

వీరందరి సమిష్టి కార్యకలాపాల ద్వారా, జి. డి ఆర్. లో ప్రేంచంద్ రచనలు మరింత ప్రజాదరణ పొందగలవని విశ్వసిస్తాం.



# నేటితరం రచయిత "బొన్దరెవ్"

సోవియట్ దేశంలో జనం విస్తృతంగా చదువుతున్న ఆధునిక వచన రచనలలో యూరీబొన్దరెవ్ రచనలు నాటకీయతలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించుకున్నాయి. ఈయన పాత్రలలోని సత్యచింతన, ఉపకారగుణం, మృదువైన హృదయం ఎటువంటి ప్రేక్షకునినైన ఇట్టే ఆకట్టుకోగలవు.

పెద్ద కథల రచనలకో పేరెన్నికగన్న ఈ రచయిత, హిట్లరు దురాక్రమణకు వ్యతిరేకంగా సోవియట్ ప్రజలు సాధించిన మహాయుద్ధంలో తన తోటివారు ఎదుర్కొన్న పరీక్షలను, విపత్తులను ఆధారంగా తీసుకొని "సైనికదళాలకు పిలుపు (1957)" "తుది ఫిరంగి కాల్పులు (1959)" అనే రెండు కథలను ఎంతో బాగరాసి, ఎందరో పాఠకుల అభిమానాన్ని సంపాదించారు. ఈ యువరచయితకు - చెప్పవలసిన ప్రతి విషయాన్ని సవివరంగా, కవితామయ సౌందర్యంతో పఠితల మనసుకు నాటుకునేటట్టు చెప్పగల మంచి నేర్పువుంది. ఈ కథలోని పాత్రను సైనిక దుస్తులు ధరించినమంచి ఆలోచనా పరులని వర్ణించినా అతిశయోక్తి కాదు. ఈయన వచన రచనలలో నైతిక విచారణా, అన్వేషణ అక్షరరూపందాల్చి ఆద్యంతం ఆసక్తితో వాటిని చదివిస్తాయి.

తరచు ఈయన కథలు విషాదాంతంగాముగుస్తుంటాయి. "తుది ఫిరంగి కాల్పులు" కథలోని ప్రధానపాత్ర విజయదినంనాడు మరణిస్తుంది.

"వేడిమంచు" అన్న నవలలో బొన్దరెవ్, స్టాలిన్‌గ్రాడ్ యుద్ధకాలాన్ని చిత్రీకరించారు. సోవియట్ దేశ భవితవ్యాన్నే నిర్ధరించిన ఈ వీరోచిత పోరాటాన్ని రచయిత తన ఈ నవలలో కళ్ళకు కట్టినట్లు చిత్రించారు.

1975లో ప్రచురణ పొందిన ఆయన నవల "తీరం" లో ప్రధాన పాత్ర ఒకనాటి సైనికాధికారి అయిన నేటిరచయిత నికితిన్.

నికితిన్ యొక్క భావగమనాన్ని బాగ అధ్యయనం చేసి రాసిన ఈ నవలలో ఏ స్వీయచరిత్రలోను కనిపించని అసాధారణ చిత్రణవుంది. ఈ నవల ఉద్దేశ్యం జీవితపు అర్థాన్ని వివేచించి చెప్పడం. రచనలో రచయిత సంపూర్ణ న్యాయం చేకూర్చారు.



తుది ఫిరంగి కాల్పులు, నిశ్శబ్దత, వేడిమంచు, విముక్తి అన్న తన నవలలకు స్క్రీన్‌ప్లే రాసి ఈ రచయిత లెనిన్ బహుమతి గ్రహీతలయినారు. ఈయన రచనలు పలుప్రపంచ భాషలలోకి అనువాదం పొంది పలుభాషల పాఠకుల ఆమోదాన్ని పొందాయి.

ఈయన ఏ విషయాన్నైనా గొప్ప శైలితో, క్లుప్తంగా, సూటిగా పాఠకుల మనస్సుకు హత్తుకునే విధంగా చెప్పగల యువరచయిత.

—లలిత్.

# రాష్ట్రం నలుదిక్కుల ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి కార్యక్రమాలు

మార్చిలో హైదరాబాద్‌లో సమావేశమైన, ఆంధ్రప్రదేశ్ ప్రజా నాట్యమండలి కార్యవర్గం పలు జిల్లాలలో తలపెట్టిన కార్యక్రమాలు కార్యరూపం ధరించాయి. అనేకమంది కళాకారులను రంగంలోకి తీసుకొచ్చి, నిర్మాణపరంగా శాఖలను స్థాపించడం వివిధ కళా రూపాల ద్వారా ప్రజలను ఉత్తేజపరచడం జరిగింది.

## హుజూర్‌నగర్ తాలూకా మహాసభ

మార్చి నెలలో జరిగిన ప్రజానాట్య మండలి మహాసభకు ప్రతినిధులు 100 మంది రాగా, చివరి రోజు బహిరంగ సభకు సుమారు 7 వేలమంది ప్రజలు హాజరయ్యారు. సి. నాగభూషణం సి. మోహన్‌దాస్ గార్లు కళల ప్రయోజనాన్ని గురించి వివరించారు. యువ కళాకారులు గేయాలతో, వివిధ కళా రూపాలతో ప్రజలను ఉత్తేజపరిచారు మహాసభలో శ్రీ చిల్కూరాజు నర్సయ్యగారు అధ్యక్షులుగాను, ఎస్. వి. రామయ్య కార్యదర్శిగాను నూతన కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు.

## అమరస్మృతి.



మార్చి 30న వరంగల్ జిల్లా, అమ్మాపురం గ్రామంలో. అమరజీవి కామ్రేడ్ తమ్మెర వెంకటనర్సయ్య స్మారక సభకు వరంగల్ కళాకారులు 25మంది నిర్వహించిన సాంస్కృతిక కార్యక్రమాలు హృదయాలను కదిలించాయి. కామ్రేడ్ వెంకట నర్సయ్య గుణ గణాలను గుర్తు చేస్తూ పాడిన పాటలు, గేయ రూపకం, "మా మతం మానవత్వం" నాటకం, శ్రీమతి కమలమ్మ దళం గొల్ల సుద్దులు, జన రంజకంగా ప్రదర్శించ బడ్డాయి.

## మార్కాపురంలో వీధుల్లో వేషాలు

ఏప్రిల్ 2, 3. 4 తేదీలలో ప్రకాశంజిల్లా ప్రజా నాట్య మండలి మహాసభలు మార్కాపురంలో జరిగాయి. జిల్లా నలుమూలలనుంచి ప్రతినిధులు,వచ్చారు నూతన జిల్లా కమిటీకి శ్రీ డి. సీతారామయ్యను అధ్యక్షుని గాను శ్రీ టి. సీతా

రామయ్యను ప్రధాన కార్యదర్శి గాను ఎన్నుకున్నారు. మూడు రోజులూ రాత్రిళ్ళు వివిధ కళా రూపాలను ప్రదర్శించారు. శ్రీయుతులు నల్లూరి వెంకటేశ్వర్లు, సి. మోహన్‌దాస్ సభలను పర్యవేక్షించారు. పదివేల మంది హాజరైన బహిరంగ సభలో శ్రీ నాగభూషణం గారు ఉపన్యసించారు చివరిరోజు సుమారు 50 మంది కళాకారులు వివిధ వేషాలలో వీధులవెంట ప్రదర్శన ఎంతో ప్రబోధాత్మకంగాను, వినోదాత్మకంగాను జరిగింది.

## విశాఖలో కార్యక్రమాలు

ఏప్రిల్ చివరన జరిగిన విశాఖ తాలూకా మహాసభ జిల్లా అంతటికి, కార్యక్రమాలు చేబట్టుటకు పునాది అయింది. శ్రీరమణ కన్వీనర్‌గా విశాఖ జిల్లా కమిటి ఏర్పడింది. శ్రీ కృష్ణ చైతన్య అధ్యక్షులుగాను శ్రీ పరశురాం కార్యదర్శిగాను నూతన తాలూకా కమిటి ఎన్నికయ్యింది. మహాసభ చివరిరోజు బహిరంగ సభలో శ్రీయుతులు యం. వి. భద్రం, నల్లూరి వెంకటేశ్వర్లు ప్రజా కళలను గురించి వుపన్యసించారు.

## మిర్యాల గూడెం తాలూకా కమిటి

5?

85 గ్రామాలనుండి, 100 మంది కళాకారులు ఏప్రిల్ 29న ఆలగడప గ్రామంలో సమావేశమయ్యారు జిల్లా ఆర్గనైజరు చిల్కూరాజు నర్సయ్య, కళలను గురించి వివరించిన అనంతరం శ్రీరాములును కన్వీనర్‌గా తాలూకా కమిటీని ఎన్నుకొని సభ్యత్వం చేర్పించుటకు కార్యక్రమం తీసుకున్నారు.

## కార్మికులతో కళాకారులు

గుంటూరు జిల్లా, చిలకలూరిపేటలో కార్మికుల "మే డే" ప్రదర్శనలో కళాకారులు కలసి యిచ్చిన ప్రదర్శనలు వుద్రుతమూగించాయి. 3 రోజులు జిల్లా ప్రజానాట్య మండలి మహాసభల అనంతరం ఈ ప్రదర్శన జరిగింది. 2 వేలమంది కార్మికులు, అనేక బహుమతులు పొందిన 25 జతల ఒంగోలు జాతి ఎద్దులు, 150 మంది కళాకారులతో జరిగిన ఆనాటి ప్రదర్శన అపూర్వం మూడు రోజులు జరిగిన సభలలో సినీనటుడు శ్రీ మాదాల రంగారావు, నల్లూరి వెంకటేశ్వర్లు, సి. నాగభూషణం గార్లు సందేశాలు యిచ్చారు. శ్రీయుతులు కోలా సత్యనారాయణరెడ్డి, యాక్టింగ్ అధ్యక్షులుగాను, సి. రామ్మోహన్ ప్రధానకార్యదర్శిగానూ నూతన కమిటీ ఎన్నుకున్నారు.

## ఇల్లెందులో శిక్షణా శిబిరం

ఖమ్మం జిల్లా మహాసభల సందర్భాన ఇల్లెందులో మే నెల చివరి 5 దినములు, పాటల శిక్షణ యివ్వబడింది. శ్రీ మోహన్‌దాస్ శిక్షణలో జరిగిన యీ శిబిరానికి 40 మంది గాయకులు హాజరయ్యారు. నూతనంగా ఏర్పడిన జిల్లా కమిటీకి శ్రీయుతులు గురుప్రసాద్ అధ్యక్షులుగా, బానయ్య ప్రధాన కార్యదర్శిగా యెన్నికయ్యారు. బహిరంగ సభలో ప్రఖ్యాత సినీ నటి శ్రీమతి జి. వరలక్ష్మి వుపన్యసించగా, యువక కళాకారులు వివిధ జానపద నృత్యాలు ప్రదర్శించారు.

## రాజోలు తాలూకా కళాకారులు

అంతర్వేదిపాలెంలో తాలూకా కళాకారుల సమావేశం కాగా, శ్రీ సి నాగభూషణం, శ్రీ యం. జి. రామారావు గార్లు ప్రసంగించారు. తాలూకాలో శాఖల నిర్మాణానికి కార్యక్రమాన్ని తీసుకున్నారు.



## హైదరాబాద్, కార్వాన్ శాఖ రెండవ మహాసభ

హైదరాబాదు సిటీకి చెందిన కార్వాన్‌లో ద్వితీయ మహాసభలు శ్రీ సత్యనారాయణ శర్మ, శ్రీ టి. బాలలింగం అధ్యక్షతన జరిగాయి. నూతన కార్యవర్గాన్ని ఎన్నుకొని, ఆఫీసుని ప్రారంభించి కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

## కిసాన్ సభలో రైతు పాటలు

జూన్ 7 నుండి 10 వరకు విజయవాడలో జరిగిన అఖిలభారత రైతు మహాసభ సందర్భాన ప్రత్యేకంగా పాటలు వ్రాయించి మోహన్‌దాస్ ఆధ్వర్యంలో కళాకారులు ప్రతిదినం ఉత్తేజకరంగా గానం చేశారు. వివిధ ప్రాంతాలనుంచి వచ్చిన 15మంది గాయనీ గాయకులు ప్రతినిధుల సమావేశంలోనే కాక, చివరి దినం బహిరంగ సభలో ప్రేక్షకులను ఉర్రూతలూగించారు. కృష్ణా జిల్లాకు చెందిన డప్పుల దళం, కంకి కొడవలి నృత్యం జాలరి నృత్యం ఆత్మ రక్షణకు కర్రసాము. ఏలూరు దళంచే 'చేనేత' నృత్యం, తెనాలి వారి బ్రతుకుకోసం నృత్యం ప్రేక్షకుల్ని ఎంతగానో ఆకట్టుకున్నాయి.

# వార్తాసంగ్రహం

## కాకినాడలో రచయితల సభ

స్థానిక రచయితలు డా॥ విజయలక్ష్మి భవనంలో సమావేశమై శ్రీ పాద వారి కథలపై డాక్టరేటు వచ్చిన శ్రీ కనక్ ప్రవాసిని అభినందించారు.

తరువాత శ్రీ అద్దేపల్లి రామమోహన రావు కవితా గానంతో ఆరంభమైన ఈ సభలో డా॥ మిరియాల రామకృష్ణ, డా॥ విజయలక్ష్మి, డా॥ కనక్ ప్రవాసి, డా॥ పి. చిరంజీవిని కుమారి తదితరులు పాల్గొన్నారు.

## ఖమ్మం జిల్లా అరసం సభ

మే 28-29 తేదీలలో జరిగిన ఖమ్మం జిల్లా అరసం మహాసభ సందర్భంగా 29న "ప్రజల భాష-సాహిత్య భాష" అనే అంశంపై శ్రీ చేకూరి రామారావు "తెలుగు నవల-సోషలిస్టు వాస్తవికత" అంశంపై శ్రీ నవీన్ ప్రసంగించారు.

సాయంత్రం శ్రీ సి. శ్రీనివాసరావు రచించిన "విజన్స్ అండ్ రివిజన్స్" కవితా సంకలనాన్ని శ్రీ సంజీవ్‌దేవ్ ఆవిష్కరించారు.

జిల్లా అరసంకు అధ్యక్షులుగా శ్రీ కౌముది, ప్రధాన కార్యదర్శిగా శ్రీ జాతశ్రీ, సలహాదారుగా శ్రీ రావెళ్ళ వెంకట్రామారావు, కార్యదర్శులుగా శ్రీ దిలావర్, ప్రత్యూష, చైతన్య, మన్నం రెడ్డి ఎన్నికయ్యారు.

## "రైతు పోరాట గీతాలు" ఆవిష్కరణ

కృష్ణా జిల్లా అరసం వారు అఖిల భారత 22వ రైతు మహాసభ సందర్భంగా శ్రీ తుమ్మల సంపాదకత్వాన ప్రచురించిన "రైతు పోరాట గీతాలు" అనే గేయ సంకలనాన్ని పార్లమెంటు సభ్యులు, అఖిలభారత రైతు సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ ఇంద్రదీప్ సిన్హా ఆవిష్కరించారు.

## చలం సాహిత్యం పై గోష్ఠి

అరసం విశాఖ శాఖ ఆధ్వర్యాన చలం సాహిత్యంపై గోష్ఠి జరిగింది. ఈ గోష్ఠికి శ్రీ ఆర్వీయార్ అధ్యక్షత వహించారు. చలం సాహిత్యం పై పరిశోధన చేస్తున్న శ్రీ వావిలాల సుబ్బారావు, నవలా రచయిత శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి, జ్యేష్ఠ వి. లక్ష్మణరెడ్డి తదితరులు పాల్గొన్నారు



## సిరిసిల్లాలో యువ సాహితీ సభ

మే 26, 27 తేదీలలో కరీంనగర్ జిల్లా సిరిసిల్లాలో కళా ప్రదర్శన, "ఆధునిక కవిత" అనే అంశంపై నగ్నముని ప్రసంగం, "తెలుగు నవల" పై గులాం గౌస్ ఉపన్యాసం, "తెలుగు కథానిక" పై శ్రీ డి. వెంకట్రామయ్య ప్రసంగం, కవి సమ్మేళనం మొదలైన కార్యక్రమాలు జరిగాయి.

## శ్రీ తుమ్మల జి. డి. ఆర్. ప్రయాణం

జి. డి. ఆర్. ఆహ్వానంపై ఆంధ్ర ప్రదేశ్ ప్రతినిధిగా అభ్యుదయ సంపా

దకులు శ్రీ తుమ్మల వెంకట్రామయ్య. జూన్ 7 వతేదీ నుండి రెండు వారాలపాటు జి. డి. ఆర్. లో పర్యటనకు వెళ్ళారు.

### సమతా రచయితల సమావేశం

అమలాపురం సమతా రచయితల సమావేశం ఈ మధ్య కోనసీమ బాంకు భవనంలో జరిగింది. సంఘాధ్యక్షుడు శ్రీ కొల్లూరి సూర్యనారాయణ మూర్తి అధ్యక్షత వహించారు. కళాప్రపూర్ణ పురిపండా అప్పల స్వామి ముఖ్య అతిధిగా విచ్చేసిన ఈ సభలో శ్రీ అబ్బూరి వారికి శ్రద్ధాంజలి సమర్పించారు. తరువాత కవి సమ్మేళనం జరిగింది.

### ఆధునిక సాహిత్యం పై గోష్ఠి

ఉస్మానియా యూనివర్సిటీ ఓల్డ్ పి. జి. హాస్టల్‌లో ఏర్పాటయిన సాహిత్య గోష్ఠిలో "ఆధునిక సాహిత్యం" అన్న అంశంపై ప్రఖ్యాత నవలా రచయిత శ్రీ నవీన్ ప్రసంగించారు.

### కనక్ ప్రవాసికి డాక్టరేటు

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి చిన్న కథలపై పరిశోధన చేసినందుకు ఆంధ్ర విశ్వవిద్యాలయం శ్రీ చామర్తి కనకయ్యకు (కనక్‌ప్రవాసి) డాక్టరేటు ఇచ్చింది. శ్రీ కనక్ ప్రవాసి కాకినాడ పి. ఆర్. ప్రభుత్వ కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా పనిచేస్తున్నారు.

### మహీధర జగన్మోహన్ మరణం

విశ్వసాహిత్య మాల సంస్థాపకులు. తూర్పు గోదావరి జిల్లా కమూనిష్టు పార్టీ మాజీ కార్యదర్శి, శ్రీ మహీధర జగన్మోహనరావు ఇటీవల మరణించారు. ఆయన వయసు 60 సం॥రాలు వారి మరణానికి అభ్యుదయ సంతాపం ప్రకటిస్తూంది.

### బ్రూనో అపిట్జ్ కన్నుమూత

"NAKED AMONG WOLVES" ను రచించిన ప్రఖ్యాత సోషలిస్టు జర్మనీ రచయిత బ్రూనో అపిట్జ్ ఇటీవల మరణించారు ఆయన వయసు 68 సం॥రాలు. వారి మరణానికి అభ్యుదయ సంతాపం ప్రకటిస్తోంది

విజ్ఞప్తి 

కీర్తి శేషులు అబ్బూరి రామకృష్ణారావుగారి జీవిత చరిత్ర, చాటువులు' ఇతర అముద్రిత రచనలూ వచ్చే జయంతి నాటికి (1980 మే 20) ప్రచురించాలని సంకల్పించాం. 1896-1979 మధ్యకాలంలో వారితో పరిచయమున్న, వారి లేఖలు గాని ఇతర రచనలు గాని తమ వద్దవున్న, సాహితీ పరులు ఆయా రచనలను, తమకు తెలిసిన జీవిత విశేషాలను, తమ గుర్తులో వున్న చమత్కార సంభాషణలను, తమకు అందుబాటులో వున్న చిత్రాలను, ఫోటోలను దయతో క్రింది అడ్రసుకు పంపగోరుతున్నాం. ఈ సందర్భంలో మాకు తోడ్పడిన వారందరికీ మేమూ, వారి కుటుంబం వారూ ఎంతో కృతజ్ఞులంగా ఉండగలం. అడ్రసు- బూదరాజు రాధాకృష్ణ, 3-6-750/సి, హిమాయత్‌నగర్, హైదారాబాదు-500 029.

బాల కథా సాహిత్య పోటీలు

అంతర్జాతీయ బాలల సంవత్సరాన్ని పురస్కరించుకొని విజయవాడ స్నేహ సాహితీ ఆధ్వర్యాన బాల కథాసాహిత్య పోటీలు నిర్వహించబడుతున్నాయి. ఈ పోటీలకు రాష్ట్ర-రాష్ట్రేతర రచయిత (త్రు) ల నుండి బాలల కథల్ని ఆహ్వానిస్తున్నారు. పోటీకి వచ్చిన రచనల్లో ఉత్తమ బాల కథానికలకు రూ॥ 116 నగదు బహుమతి ఇవ్వబడుతుంది. బాలలకు సంబంధించిన యితి వృత్తమే కథాంశంగా వుండాలి. కథలు పది పేజీలకు మించకుండా వుండాలి. రచయిత (త్రు) లు తమతమ రచనల్ని ఎడిటర్ స్నేహ సాహితి, శివాలయం వీధి, విజయవాడ 520001, అనే చిరునామాకు జూలై 10 వ తేదీలోగా పంపాలి.

సంతాపం

అభ్యుదయ సాహిత్యాభిమాని, యువ డాక్టరూ కావూరి రమేష్ మరణానికి అభ్యుదయ సంతాపం ప్రకటిస్తుంది.

—o—



---

# గాయం

గాయం తగిలింది అబ్బో - అబ్బొబ్బో
బాధ భరించలేను అన్పించింది।

ఒకరోజే! రెండోరోజు, మూడోరోజు, నాలుగోరోజు
చిత్రం చిత్రాతిచిత్రం, చాలా విచిత్రంగా బాధ అలవాటు అయిపోయింది.
బాధసహనాన్ని నేర్పింది. సహనంవల్లగాయం యొక్క అనలం చల్లారిపోయింది.
ఇప్పుడు గాయం. అపురూప వరంనాకు।

ఏమంటే గాయం తగిలితేనేగా బాధ తెలిసేది?
బాధ సహించటం వల్లనేగా, అగ్నిజ్వాలలను మంచు పూలతో కప్పకలిగే
నేర్పు అలవడేది?
బాధలోనే సౌఖ్యమున్నదన్న సంగతి తెలిసే సహస్రకిరణుడు
అస్తమయంలోనే ఆనందం అంచులుచూడబోయి
నిశాకాంత ఉక్కు కౌగిలిలో బందీ అయినాడు. వెర్రి నాగన్న!

—"అరుణప్రియ"

**సమీక్ష**

## మాట్లాడిన మానవత.

రచయిత సుంన్న అచ్యుత రావు.
మణిపబ్లికేషన్స్, శ్రీకాకుళం.
వెల. రు 5/-.

మాట్లాడిన మానవత (వచన కవితా సంపుటి) లో చిన్నవీ పెద్దవీ 41 కవిత లున్నాయి.

ప్రకృతి సౌందర్యంతో పరవశించి రాసినకవితలూ, ప్రేమకవితలూ కొన్ని, మిగతావన్నీ సమాజంలోనిలోపాలమీదా, సాంఘిక సమస్యలమీదా కవి తనకున్న ఆందోళనని వ్యక్తంచేసిన కవితలు, 'సమాజానికి సందేశమివ్వాలి' అన్న తన లక్ష్యాన్ని సాధించేందుకు కవి ప్రయత్నించాడు.

గాంధీ నెహ్రూల బోధనలను దిగంతాలకు చాటితే సమాజం చక్కబడుతుందనే కవిభావం కవితల్లో కన్పిస్తుంది.

'అధికార హోదాలు, ఆశ్రిత పక్షపాతాలు, డాబూ దర్పాలు రాజ్యం చేస్తున్నాయి' వీటిని ఎదిరించి పోరాడే వికాసాన్ని పెంపొందించమనీ, సమాజాన్ని మార్పించమనీ-'కర్తవ్యం' నిర్దేశించారు.

స్వాతంత్ర్య సమరంనాటి ఆశయాల కిరణాలు ఆదర్శాల నినాదాలు దేశంలో ఆచరణలో లేకుండా పొయ్యాయన్న తన ఆవేదనను బహిరంగ లేఖగా వ్యక్తపరచారు.

బంగ్లాదేశ్‌లో ఆ నాడు జరిగిన మారణ హోమాన్ని. ఊచకోతనీ 'సోనార్ బాంగ్లా' లో ఖండించారు.

శ్రీకాకుళ ప్రాంతంలో విప్లవం పేర ఉగ్రవాదులు గావించిన కొన్ని వికృత చేష్టల్ని, అర్థంలేని ఆవేశాన్ని 'ఏది మానవత్వం' లో కవితారూపమిచ్చారు.

గ్రామాల్లో పెద్దలుచేసే అక్రమాలనీ, హిప్పీమార్కు యువతరాన్ని దరిద్రనారాయణుల్ని-యింకా అనేక సాంఘిక సమస్యల గురించి కవి తన కవితల్లో పరామర్శించాడు. నిత్యం పెరుగుతున్న సమస్యలకీ, పేదరికానికీ, అలముటించే ఆకలిబాధకూ-సర్వరోగనివారిణి కుటుంబనియంత్రణ అనేభావం 'ఇది అందరి అభిమతం కావాలి' కవితలో ద్యోతకమవుతుంది.

57

మధ్య తరగతి ప్రజల సమస్యల మీదా, సాధారణ అన్యాయాల మీదా కవికి అసహనం ఉంది. వీటిని అధిగమించాలనే తపనఉంటి. అదేదో మంచితనం పెంచుకోడంవల్లనో, తాతలు తాగిన నేతులు తలుచుకోవడం వల్లనో తీరే సమస్యలుకావు. అమరవీరుల త్యాగఫలం ఎందుకూ కొరగాకుండా పోవటంలోని అంతర్యం వెతకాలి. ఈ వ్యాపార సమాజపు దుర్లక్షణాలుగా సాంఘిక సమస్యలని అర్థంచేసుకోవాలి. లేకుంటే కవి ఆవేదనా మూర్తిగా మారిపోతాడు. పురోగామిగా తన పాత్రను నిర్వహించడంలో విఫలం చెందుతాడు. దోపిడీ సమాజంలోని దుర్మార్గాన్ని ఎదుర్కోనేందుకు. దోపిడీని రద్దుచేయాలనీ, అందుకు సమస్త శ్రామిక జనచైతన్యం

జ్వలించాలనీ-కవి అవగాహన చేసుకోవాలి.

అప్పుడు తన కవిత్వం మరింత పదునెక్కుతుంది. కవితకు ఒక ప్రయోజనం ఏర్పడ్తుంది. లేకుంటే కవి తనగందరగోళంతో చదువరుల్ని గందరగోళపరుస్తాడు. ఆ ప్రమాదం లేకుండా ఈ రచయిత జాగ్రత్త పడాలి.

పదుగురిచేత సెబాసనిపించుకునేందుకు కవిత్వంలో క్లుప్తత, సౌందర్య దృష్టి అవసరం. చాలా కవితల్లో యివి లోపించడం బాగా కన్పిస్తుంది. సౌందర్యదృష్టి తగ్గటంవల్ల కొన్ని కవితలు ఉపన్యాసధోరణిలో నడిచినయి. మరింత కవితాశిల్పం సంతరించుకోందే - వీరి కవితలు నాలుగు కాలాలపాటు నిలదొక్కుకో లేవు. అందుకు కవికి మరింత సాధన అవసరం.

శీలా వీర్రాజుగారిముఖపత్ర రచన, శ్రీ శ్రీ, ఆరుద్రల అభిప్రాయాలు ఈ సంపుటిలో అదనపు ఆకర్షణలు.

—కాచినేని రామారావు

మంచైనా, చెడైనా తన ప్రభావాన్ని త్వరితగతిని ప్రదర్శించేది పసివయసు మీదే. పిల్లల ప్రవర్తనమీదా, తెలివితేటలమీదా వారి చుట్టూవున్న జీవన విధానాలు, పరిస్థితులు ఎంత ప్రభావితం చేయగలవో పసితనంలో వారు చదివే పుస్తకాలు కూడా అంతగా ప్రభావం చూపగలవు. కాబటి వారి మానసిక వికాసానికి దోహదం చేస్తూ, వారిని రేపటి సత్పౌరులుగా తీర్చిదిద్దే సాహిత్యం అవశ్యకత ఈనాడెంతో ఉంది.

58

ఈ 'పిల్లల పాటల్లో' సోమరిపోతు సోమన్నలనీ, గొప్పలుచెప్పే గోపన్నలనీ దెప్పిపొడుస్తూ, నిద్రాణ స్థితి నుండి యువతరాన్ని మేల్కొలుపుతూ— "మాటలు చెప్పుట మానుకొని-చేతలలో చూపించాలి. ప్రగతిబాటలో నడవాలి—మంచిపేరునే పొందాలి" అని సందేశమిస్తూ పిల్లల భాషలోనే పిల్లల భావాలను, పిల్లల మనస్తత్వాలను చాలా చక్కగా ఆవిష్కరించాడీ రచయిత.

—ఎస్వీ.

## పిల్లల పాటలు

రచయిత: ఎర్రోజు సత్యం:
ప్రచురణ: నటరాజ కళానికేతన్-
ఎల్లారెడ్డిపేట శాఖ;
వెల : 1-50;
ప్రతులకు : ఎర్రోజు సత్యం,
పోష్టు రాచర్ల బొప్పాపూర్-505305
(కరీంనగర్ జిల్లా)

## అవగాహన

బుక్సు అండ్ బుక్సువారి సమర్పణ:
32 పేజీల సంకలనం:
మానేపల్లి సత్యనారాయణ

బుక్సు అండ్ బుక్స్, విజయనగరంలోని అభ్యుదయ సృజనాత్మక రచయితల సంఘం, వారు ప్రకటించిన బుక్‌లెట్ ఈ అవగాహన.

రోణంకి, చాసో, సంజీవదేవ్, శ్రీశ్రీ లాంటి పెద్దల సలహా సంఘంతో పురోగమిస్తున్న సంస్థ బుక్స్ అండ్ బుక్స్.

అవగాహన పేరుమీద మరికొన్ని సంకలనాలను తేవాలన్నది సంస్థ ఆకాంక్ష. వ్యాపార పత్రికలే రాజ్యంచేస్తున్న ఈ పరిస్థితుల్లో ఇటువంటి బుక్‌లెట్స్— సాహిత్య సంస్థలనీ, ఔత్సాహిక రచయితల్నీ వెలుగులోకి తీసుకొస్తాయి. చాసో, రోణంకి, కుటుంబరావుల రచనలతో పాటు, రెడ్డిశాస్త్రి పెద్దకథ, విజయచంద్ర, నళినీదేవి, నాగేశ్వరరావు, పీరపాణి, బుర్రా, నగ్నముని—గార్ల ఆలోచనాత్మక కవితలూ – ఇందులో ఉన్నాయి.

మాండలిక రచనలను ప్రచురించే ముందు సంకలన కర్తలూ రచయితలు ఒక జాగ్రత తీసుకోవాలి. ఆ రచనలు ఇతర మండలాల వారికి అర్థంకానంతగా ఉండకుండాచూడాలి. తరువాత రాబోయే 'అవగాహన' లలో ఈ జాగ్రత తీసుకుంటారని ఆశిద్దాం.

—కేయార్

—౦౦౦—

# కలం మంట



గీసే గాని
అగ్గి పుల్లే కాదు.
కలమూ మండుతుంది—
వ్యత్యాసమల్లా
ప్రయోజనంలో—
ఫలితం లో—
ఔను!
అగ్గి పుల్ల మంట వత్తిని, పాడు చెత్తను కాల్చితే
'కలం మంట' మనసుల్ని వెలిగిస్తుంది!,
అది తర తరాలకు తరగని వెలుగౌతుంది!

—ఖమ్రొద్దీన్.

# అహోరాత్రిలు తుఫాను ప్రాంతం సహాయం చర్యలు

కోస్తా ఆంధ్ర జిల్లాలపై 1979 మే 12 న విరుచుకు పడ్డ తుఫాను రక్కసి విషాదకర నాశనాన్ని మృత్యు భీభత్స దృశ్యాన్ని విడిచి పోయింది. మృతుల సంఖ్య 600 వరకు ఉంది. మొత్తంనష్టం 681 కోట్ల రూపాయలని అంచనా. ఇవాళ, యుద్ధ ప్రాతిపదికపై సహాయ, పునరావాస కార్యక్రమం అమలు జరుగుతోంది.

రు. 853.48 లక్షలు ఇప్పటి వరకూ సహాయ చర్యలకోసం ఖర్చు పెట్టారు.

12,336 టన్నుల బియ్యం, అయిదు లక్షలకు పైగా ధోవతులు, చీరలు తుఫాను బాధితులకు పంచారు.

ప్రకాశం నెల్లూరు జిల్లాలలో వ్యవసాయ కార్యక్రమాల పునరుద్ధరణ కోసం రు. 17.83 కోట్లను వ్యవసాయ దారులకు అందజేశారు.

ప్రారంభ దశలో నెల్లూరు ప్రకాశం జిల్లాలలో 25 కోట్ల రూ।। ఖర్చుతో తీరం వెంబడి ఒక లక్ష గృహాల నిర్మాణం జరుగుతుంది.

డి. ఐ. పి ఆర్

